# చందమామ

## ఈ సంచికలో కథలు
## వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫొటోశీర్షికల పోటీ మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



## కోకా-కోలా సాంగత్యం బ్రతుకే ఒక సారస్యం

ఉమ్మడిగా తినటంలో ఉన్న మజాయే వేరు! దానికి కోకా-కోలా తోడైతే పసిడికి పరిమళమబ్బినట్లే! ఉల్లాసం, ఉత్తేజం కలిగించే సజీవమైన రుచి కోకా-కోలా రుచి. అందుకనే, త్రాగాలనిపిస్తుంది మళ్ళీ మళ్ళీ. త్రాగండి కోకా-కోలా—మళ్ళీ కోకా-కోలా—మళ్ళీ మళ్ళీ కోకా-కోలా! ప్రపంచంలో నలుమూలలా, పెరిగిపోతోంది కోకా-కోలా త్రాగేవారి సంఖ్య రోజు రోజుకూ. కారణం: సేదతీర్చటంలో, కనివిని ఎరుగని కమ్మదనం కోకా-కోలా కమ్మదనం!




కోకా-కోలా, కోకా-కోలా కంపెనీవారి రిజిస్టరు చేయబడిన ట్రేడ్‌మార్కు.

CMCC-17-162 TEL


ఇప్పుడు చూయింగ్ గమ్
క్రొత్త ఆనందాన్ని
కలిగిస్తుంది!
చిక్‌లెట్స్
చూయింగ్ గమ్
ADAMS
Chiclets
TUTTI-FRUTTI
FLAVOR COATED GUM
12 PIECES
60 పైసలకు 12
చిక్‌లెట్స్ చూయింగ్ గమ్ ఇప్పుడు
అద్భుతకరమైన క్రొత్త రుచితో లభిస్తుంది:
టూట్టి-ఫ్రూట్టి!
అద్భుతకరమైన రుచిగల
చిక్‌లెట్స్ చూయింగ్ గమ్
—ఇప్పుడే కొనండి!
పెప్పర్‌మింట్ రుచిగల
చిక్‌లెట్స్ కూడ లభిస్తుంది:
60 పైసలకు 12
10 పైసలకు 2
ఆడమ్స్‌వారి శ్రేష్ఠమైన తయారీ
WH. 1424









# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి... రోజంతా దంతక్షయాన్ని నివారించండి!




DC.G.41

కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టిన దని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎప్పుడూ ప్రకటింపబడినటు శాస్త్ర పరీక్షలు నిరూపించేయి. ఎందుకంటె: కాల్గేట్ డెంటల్ క్రీముతో ఒకసారి పళ్లు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ ఋజువు ఉన్నది! ఎంతో చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీముతో రోజూ పళ్లు తోముకొనుటకు పిల్లలు ఇష్టపడతారు!

COLGATE
DENTAL CREAM

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్లకు...ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్టుకంటె కాల్గేట్‌నే కొంటారు!


ఎక్కడ
లైఫ్‌బాయ్
వున్నదో అక్కడ
ఆరోగ్యం
వున్నది
LIFEBUOY
for health
LIFEBUOY SOAP
లైఫ్‌బాయ్
మురికిలో గల సూక్ష్మ
క్రిములను కడిగివేస్తుంది
లింటాస్-L-61 77 TL
హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి



# Carona
## Wish you a Happy Divali



**Miss India**
sizes 2-7
Rs. 11.95 *



**Ragini (No. 2)**
sizes 4-7
Rs. 17.95 *



**Rajan T/T**
sizes 6-10
Rs. 15.95 *



**Topstyle**
sizes 6-10
Rs. 14.95 *



**Captain Carefree**
sizes 6-10
Rs. 20.50 *



**Mansfield Monk T/T**
sizes 6-10
Rs. 39.95 *



**Braves Derby R/S**
sizes 6-10
Rs. 38.95 *



**Wearwel**
sizes 6-10
Rs. 29.95 *

See the elegant new Divali range
at your favourite Carona Shop.

* Taxes Extra

**Carona** FOOTWEAR

AIYARS/CS. 156

# మీరు కాఫీతో
# బ్రిటానియా మారి
# బిస్కట్లు తీసుకొనండి




BBC-1003



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల "చందమామ" పక్కకుట్టుతో కాకుండా, మధ్యకుట్టుతో వెలువడుతుందని గత నెల సంచికలో ప్రకటించాము. కాని కారణాంతరాల వల్ల ఈ నెల సంచిక మధ్యకుట్టుతో కాక పక్కకుట్టుతోనే వెలువడుతున్నది. ఈ మార్పు జనవరి నెల సంచిక నుంచి జరుగుతుంధని పాఠకులు గమనించ ప్రార్థన.

"మాయదారి ముసలిది" అన్న హాస్యరస ప్రధానమైన పెద్ద కథ ఈ సంచికతో పూర్తి అవుతున్నది.

సంపుటి 47 నవంబర్ '70 సంచిక 5



CHITRA




# అనుకోని విజయం

కపిశానగరంలో మాధవశర్మ అనే మహా పండితుడు ఉండేవాడు. ఆయన ధన సంపన్నుడు కూడానూ. ఆయనకు పరిమళ అనే అందమైన కుమార్తె ఉండేది. ఆమె కూడా మంచి తెలివితేటలు గలది.

పరిమళ తెలివి గలది గనకనూ, భాగ్యవంతుడి కూతురు గనకనూ ఎందరో యువకులు ఆమెను పెళ్ళాడగోరి వచ్చేవారు. పరిమళ వారిని ఏదో చర్చలోకి దింపి, తాను వేసే ప్రశ్నలకు వారు సమాధానం చెప్పలేరని నిరూపించి పంపేస్తూ ఉండేది. తన ప్రశ్నలకు సమాధానం చెప్పగల వాణ్ణే తాను పెళ్ళాడాలని ఆమె ఉద్దేశం.

ఆ నగరంలోనే రాధాకాంతు డనే ఒక పేద యువకు డుండేవాడు. అతని తండ్రి భిక్షాటన చేసి కుటుంబపోషణ చేసేవాడు. రాధాకాంతుడు మంచి తెలివి తేటలు గలవాడు. అతనికి విద్య మీద అమితమైన ఆశ ఉండేది. చాలామంది గురువులకు శుశ్రూష చేసి చాలా జ్ఞానం సంపాదించాడు. కాని అతని జ్ఞానదాహం తీరలేదు. దేశమంతా తిరిగి ఉద్దండ పండితుల వద్ద చేరి, మరింత జ్ఞానం సంపాదించాలని అతని ఉద్దేశం. అందుకు ధనసహాయం కావాలి. మాధవశర్మ తనకు సహాయం చేస్తాడేమోనని అతడు మాధవశర్మ ఇంటికి వచ్చాడు.

అతను కూడా తనను పెళ్ళాడగోరి వచ్చిన యువకుడే నని భ్రమపడి పరిమళ అతన్ని మాటలలోకి దింపి, "నాకు ఒక అనుమానం. ఎంతమంది నడిగినా తీర్చకుండా ఉన్నారు," అన్నది.

"ఏమిటా అనుమానం?" అన్నాడు రాధాకాంతుడు.

"ఈ లోకంలోనూ, పై లోకంలోనూ కూడా సుఖపడేది ఎవరు? కష్టపడేది ఎవరు?" అని పరిమళ అడిగింది.

కావుగంటి లక్ష్మిపర్వతవర్ధని

"ఈ లోకంలోనూ, పై లోకంలోనూ కూడా సుఖపడేవాడు సన్యాసి. అతనికి సంసారతాపత్రయా లేవీ ఉండవు. ఏ చెట్టు కిందనైనా పడుకుంటాడు. దొరికినది తింటాడు. ఆశలు లేనివాడు గనక నిరాశకు గురికాడు. ఆ విధంగా ఈ లోకంలో సుఖంగా జీవించి, బంధవిముక్తుడై పై లోకానికి పోయి, అక్కడా సుఖపడతాడు. ఈ లోకంలోనూ, పై లోకంలోనూ కూడా కష్టపడేవాడు బిచ్చగాడు. వాడి ఇహలోక జీవితమంతా కష్టాలతోనే గడుస్తుంది. ఎండకు ఎండుతాడు, వానకు తడుస్తాడు, చలికి వణుకుతాడు. వాడి కాల మంతా కడుపు నింపుకునే ప్రయత్నంలోనే గడుస్తుంది. ఆ కడుపు ఏనాడూ నిండదు. బతికి ఉన్నంత కాలమూ మరొకడికి చిన్న మెత్తు ఉపకారం చెయ్యలేనందున పై లోకంలో కూడా వాడికి ఏ విధమైన సుఖమూ ఉండదు," అన్నాడు రాధాకాంతుడు.

అతను చెప్పిన సమాధానంతో తృప్తిపడి పరిమళ అతన్ని పెళ్ళాడదామని మనసులో తీర్మానించుకున్నది.

అయితే రాధాకాంతుడి మనసులో పెళ్ళి ధ్యాస ఏమీ లేదు. అతను మాధవశర్మను ధనసహాయం కోరుదామని వచ్చాడు. ఇంత సేపు పరిమళతో మాట్లాడిన మీదట అతనికి



పరిమళ సహాయంతో మాధవశర్మ నుంచి ధనసహాయం పొందవచ్చు నన్న ఆలోచన కలిగింది.

అందుచేత అతను పరిమళతో, "నేను నిన్ను మరొక ప్రశ్న వేస్తాను. దానికి నువు సమాధానం చెప్పలేని పక్షంలో, మీ నాన్న గారి చేత నాకు కొంత ధనసహాయం చేయించాలి," అన్నాడు.

పరిమళ సరే నన్నది.

"ఈ లోకంలో సుఖపడి, పై లోకంలో కష్టపడే వాడెవడు? ఈ లోకంలో కష్టపడి, పై లోకంలో సుఖపడే వాడెవడు?" అని రాధాకాంతుడు పరిమళను అడిగాడు.

పరిమళ కొంచెం ఆలోచించి, "ఈ లోకంలో సుఖమూ, పై లోకంలో కష్టమూ పొందేవాడు దుర్బుద్ధి గల ధనికుడు. అతను డబ్బు సంపాదించటం కోసం ఏ పాతకానికైనా ఒడిగట్టుతాడు, ఎంతమంది సుఖాన్నయినా బలి పుచ్చుకుంటాడు. ఇలా బతికినవాడు పై లోకంలో సుఖపడడు. ఈ లోకంలో కష్టపడి, పై లోకంలో సుఖపడేవాడు యోగి. అతను ఈ లోకంలో సమస్త సుఖాన్నీ విసర్జించి, శరీరాన్ని తపింపజేసి, చచ్చిపోయి ఉత్తమ లోకాలను చేరుకుంటాడు," అన్నది.

తన ఆశయం నెరవేరనందుకు రాధాకాంతుడు చిన్నబుచ్చుకున్నాడు. ఇంతలో మాధవశర్మ వచ్చి, "నాయనా, మా అమ్మాయి అడిగిన దానికి సరి అయిన సమాధానం చెప్పావుట. ఆమె నిన్ను పెళ్ళాడటానికి ఒప్పుకున్నది. నీకు కూడా సమ్మతమైతే మీ కిద్దరికీ పెళ్ళి చేసేస్తాను," అన్నాడు.

రాధాకాంతుడు మొదట నిర్ఘాంతపోయినాడు. తనకు అనుకోని విధంగా కార్యం సిద్ధించినందుకు సంతోషించి, అతను పరిమళను పెళ్ళాడటానికి తన సమ్మతి తెలిపాడు.





# పరధనం తాచుపాము!

ఒక ఊళ్ళో ఒక కటిక పేద బ్రాహ్మడు ఉండేవాడు. ఆయన రోజూ నాలుగిళ్ళూ తిరిగి, పంచాంగం చెప్పి, తన కుటుంబాన్ని అతి కష్టం మీద పోషిస్తూ ఉండేవాడు.

రాజుగారికి ఈ బ్రాహ్మడి పేదరికం గురించి తెలియవచ్చింది. ఆయన ఆ బ్రాహ్మడికి ఉపకారం చేయగోరి, తన భవనానికి కూడా వచ్చి పంచాంగం చెప్పమని కబురుచేశాడు.

బ్రాహ్మడు రాజుగారి వద్దకు వెళ్ళి, తిథివార నక్షత్రాలూ, వర్జ్యమూ వగైరాలు చెప్పాడు. రాజుగారు ఆ బ్రాహ్మడికి ఒక గుమ్మడికాయ ఇప్పించాడు.

ఆ గుమ్మడికాయ తీసుకొని బయలు దేరిన బ్రాహ్మడు ఇంటికి పోతూ, దారిలో కనిపించిన మరొక బ్రాహ్మడి ఇంటి ముందు ఆగి, "బాబూ, నాకు ఈ గుమ్మడికాయ దొరికింది. మా ఇంట్లో మా కెవరికీ గుమ్మడి కాయ సయించదు. దీన్ని మీరు వాడుకోండి," అని దాన్ని ఆ గృహస్థు కిచ్చి తన దారిన తాను వెళ్ళాడు.

తరవాత ఆ ఇంటి యజమాని భార్య కూరచేద్దామని, ఆ గుమ్మడికాయ తరిగే సరికి, అందులోనుంచి ఇంత బంగారం ముద్ద కింద పడింది.

"అయ్యో, పాపం, ఆ పంచాంగం బ్రాహ్మడు, ఈ గుమ్మడికాయలో బంగారం ఉందని ఎరగక, దీన్ని కాస్తా మన కిచ్చేశాడు. అతని సొమ్ము మనకెందుకు. మీరు వెంటనే అతనికి ఇచ్చేసి రండి," అన్నది గృహస్థు భార్య.

బంగారం చూస్తుంటే గృహస్థుకు కన్ను కుట్టింది. ఆయన తన భార్యతో, "నువ్వు చెప్పినది నిజమే ననుకో! అయినా ఆ బ్రాహ్మడు నష్టజాతకుడు. అందుకే లక్ష్మి అతని వెంట పోక మన ఇంటికి

సి. సుగుణ

వచ్చింది. ఇంటికి వచ్చిన లక్ష్మిని వెళ్ళి పోనివ్వరాదు," అన్నాడు.

"ఏ మండీ, పరధనం తాచుపాము! దాన్ని తీసుకోరాదు. నా మాట వినండి," అన్నది భార్య. కాని గృహస్థు, భార్య మాట వినిపించుకో లేదు.

మర్నాడు పంచాంగం చదవటానికి వచ్చినప్పుడు రాజు పేదబ్రాహ్మడితో, "ఏమయ్యా, బ్రాహ్మడా? నిన్న నే నిచ్చిన గుమ్మడి కాయ వండుకు తిన్నారా? ఎలావుంది? బాగున్నదా?" అని అడిగాడు.

రాజుగారిచ్చిన గుమ్మడికాయను ఎవరికో దానం చేసినట్టు తెలిస్తే రాజుగారికి కోపం వస్తుందని భయపడి పంచాంగం బ్రాహ్మడు, "తిన్నాం, మహారాజా! చాలారుచిగా వున్నది!" అన్నాడు.

బ్రాహ్మడు బంగారం మాట ఎత్తక పోవటం చూసి, ఆ గుమ్మడికాయ మరెవరికో చేరిందని రాజు గ్రహించి, "నిన్న ఇచ్చిన గుమ్మడికాయ చిన్నది. ఇవాళ పెద్దది ఇప్పిస్తాను. దీనిరుచీ ఎలా ఉన్నదీ రేపు చెప్పు," అని, తన సేవకుల చేత బ్రాహ్మడికి మరింత పెద్ద గుమ్మడికాయ ఇప్పించాడు.

పంచాంగం బ్రాహ్మడు దాన్ని తీసుకు పోయి, కిందటి రోజు ఇచ్చిన గృహస్థుకే



దాన్నికూడా ఇచ్చి, తన దారిన తాను వెళ్ళిపోయాడు.

గృహస్థు ఆత్రంపట్టలేక దాన్ని అప్పటి కప్పుడే నేలకేసి కొట్టి పగల గొట్టాడు. అందులో నుంచి తాచుపాము వచ్చి గృహస్థు చుట్టూ పరిగెత్తసాగింది.

"ఏమేవ్, పాము! నా మీద పగపట్టింది! దీన్ని ఎలాగైనా చంపాలే!" అంటూ గృహస్థు కేకలు పెట్టాడు.

"పరధనం తాచుపామండీ అంటే విన్నారా?" అంటూ ఆ ఇల్లాలు ఒక్క పరుగున పంచాంగం బ్రాహ్మడుండే పూరి కొంపకు పరిగెత్తి, "నాయనా! బాబూ! నా పసుపూ, కుంకమూ నిలబెట్టు! నీ బంగారం నువు తీసుకుని, మా ఆయనను తాచుపాము నుంచి కాపాడు!" అని లబలబలాడ సాగింది.

పంచాంగం బ్రాహ్మడికి ఆమె చెప్పేది ఏమీ అర్థంకాలేదు. తన బంగారం ఏమిటో, తాచుపామేమిటో అంతుబట్టక ఆయన అలాగే నిలబడ్డాడు.

గృహస్థు భార్య ఆయనను చెయ్యిపట్టు కుని తన ఇంటికి లాక్కుపోయింది. అప్పటికి గృహస్థు ఇంటి ముందు చాలా మంది గుమికూడారు. గృహస్థు భయంతో రొప్పుతూ, జరిగినదంతా పదిమందికీ చెబు తున్నాడు. ఈ హడావిడిలో పాము ఎటో పారిపోయింది.

పంచాగం బ్రాహ్మణ్ణి చూడగానే గృహస్థు, "వచ్చావా, నాయనా? నీ బంగారం కాజేసి నందుకు నా కివాళ పాము నుంచి వెంట్రుక వాసిలో చావు తప్పింది. నీ సొమ్ము నువు తీసుకు పో!" అన్నాడు.

రాజుగారు ఈ రోజు పంచాంగంబ్రాహ్మడి వెనక తన మనుషులను పంపాడు. వాళ్లు జరిగినదంతా చూసి వెళ్ళి, రాజు గారికి చెప్పారు. తాను వేసిన ఎత్తు పారినం దుకు రాజుగారు చాలా ఆనందపడ్డాడు.






విపది ధైర్య, మథాభ్యుదయే క్షమా,
సదసి వాక్పటుతా, యుధి విక్రమః,
యశసి చాభిరతి, ర్వ్యసనం శ్రుతౌ,
ప్రకృతిసిద్ధ మిదం హి మహాత్మనాం.... 1

[అపదలో ధైర్యమూ, ఐశ్వర్యములో ఓర్పూ, సభలో వాక్పాటవమూ, యుద్ధములో శౌర్యమూ, కీర్తియందు ఆసక్తీ, శాస్త్రాలలో అధికాసక్తి గొప్పవారి సహజగుణాలు]

సంపత్సు మహతాం చిత్తం భవే దుత్పలకోమలం,
ఆపత్సు చ మహాశైలసంఘాతకర్కశం. 2

[సంపద కలిగినప్పుడు గొప్పవారి మనసులు కలువల వలె కోమలంగా ఉంటాయి; ఆపదలు కలిగినప్పుడు కొండరాయిలాగా కఠినంగా ఉంటాయి]

ప్రదానం ప్రచ్ఛన్నం, గృహ ముపగతే సంభ్రమవిధిః,
ప్రియం కృత్వా మౌనం, సదసి కథనం చాప్యుపకృతేః,
అనుత్సేకే లక్ష్మ్యాం, నిరభిభవసారాః పరకథాః,
సతాం కేనోద్దిష్టం విషమ మసిధారావ్రతమిదం?.... 3

[రహస్యంగా దానంచేయటం, అతిథులను ఆదరించటం, మంచిచేసి చెప్పకోక పోవటమూ, పొందిన ఉపకారాన్ని బాహటంగా చాటటమూ, సిరి వచ్చినప్పుడు గర్వించకపోవటమూ—ఇవి కత్తి మీద సాములాటివి; ఒకరు చెబితే వస్తాయా?]

సజ్జనులు



# రాతిరథం

## 2

[ ఖడ్గవర్మ, జీవదత్తుడు అనే క్షత్రియయువకు లిద్దరు, పద్మపురాన్ని పాలించే పద్మసేన మహారాజును అరణ్యంలో కలుసుకున్నారు. సాయంకాలానికి అందరూ నగరానికి చేరారు. ఆ సమయంలో రాజవీధిని అల్లకల్లోలపరుస్తున్న పట్టపుటేనుగును ఖడ్గవర్మా, జీవదత్తులు సంహరించారు. రాజకుమారి పద్మావతి వాళ్ళమీద పూలు జల్లింది. తరవాత—]

మంత్రి సోమదేవుడి సలహా పద్మసేన మహారాజుకు చాలా యుక్తియుక్తంగా వున్నట్టు కనిపించింది. యువరాణి పద్మావతి ఎంతో కాలంగా, మహావీరుడైనవాణ్ణి తప్ప, మరొకడిని వివాహ మాడనని పంతంపట్టి కూర్చున్నది. ఆమెను వివాహ మాడదలచి ఎందరో రాజకుమారులు వచ్చారు. కాని, పద్మావతి వారందరినీ ఏదో వంక చెప్పి తిరస్కరించింది. వాళ్ళల్లో అందచందాలూ, తెలివితేటలే తప్ప, నిజమైన వీరుడి కుండవలసిన లక్షణాలు ఏ మాత్రమూ లేవని ఆమె తండ్రితో అన్నది.

పద్మసేనమహారాజుకు, ఖడ్గవర్మా, జీవదత్తుడూ మహావీరుల్లా కనిపించారు. వాళ్ళు అరణ్యంలో భయంకరమైన సింహాలనూ, పులులనూ వేటాడిన తీరు, అపూర్వమైనది! ఏవో పాతకాలపు కథల్లో తప్ప, ఎవరూ ఆ క్రూరమృగాలను ముఖాముఖి ఎదు



ర్కొని అలా సంహరించటం తాను వినలేదు, చూడలేదు.

సోమదేవుడి అజ్ఞ ప్రకారం ఖడ్గవర్మ, జీవదత్తులకు రాజుగారి అతిథి గృహంలో విడిది ఏర్పాటు చేయబడింది. రాజు తన కుమార్తెను పిలిచి, వారిద్దరూ అరణ్యంలో చేసిన సాహస కృత్యాల సంగతి చెప్పి, "అమ్మా, ఏనుగును చంపగానే వాళ్ళ మీద నువ్వూ, నీ చెలికత్తెలూ పూలు జల్లటం నేను చూశాను. వాళ్ళల్లో ఎవరినైనా నీవు వరించావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు పద్మావతి చిరునవ్వు నవ్వి, "నాన్నా, నీ మాటలు నాకు వింతగా వున్నవి. పట్టపు ఏనుగును చూసి రాజవీధిలో వున్న జను లందరూ బెదిరి పారిపోయిన మాట నిజమే. నీ వెంట వచ్చిన ఆ యువకు లిద్దరూ దాన్ని ధైర్యంగా ఎదుర్కొని చంపి, నగర ప్రజల ప్రాణాలు కాపాడిన మాటా నిజమే. అయినా, అంతమాత్రానికే వాళ్ళు మహావీరులవుతారా? నక్కను కొట్టిన వాడల్లా వేటగాడవుతాడా!" అన్నది.

"నీ వన్నది బావున్నది. కాని, ఏ ఘన కార్యం చేసినవాడు మహావీరుడవుతాడు? ఆ సంగతి స్పష్టంగా నువే తేల్చి చెప్పాలి. నాకు మాత్రం ఆ ఖడ్గ, జీవదత్తు లిద్దరూ మహావీరుల్లానే కనబడుతున్నారు," అన్నాడు మహారాజు.

"అయితే వాళ్ళను పిలిపించండి. వాళ్ళె లాంటివాళ్ళో యిప్పుడే తేల్చి చెపుతాను. మీరు మాత్రం యీ ప్రశ్నలు వారి నడగండి," అని పద్మావతి తండ్రికి అడగ వలసిన ప్రశ్నలు చెప్పింది.

రాజు సేవకుణ్ణొకణ్ణి మంత్రిని పిలుచుకు రమ్మని చెప్పి, మరొకణ్ణి ఖడ్గ, జీవదత్తుల్ని తీసుకు వచ్చేందుకు అతిథి గృహానికి పంపాడు. కొద్దిసేపటికల్లా, మంత్రి సోమదేవుడూ, ఖడ్గవర్మా, జీవదత్తులూ రాజుగారి దగ్గరకు వచ్చారు.

పద్మసేనుడు, ఖడ్గ, జీవదత్తుల్ని, "మీరు దేశాటనకు బయలుదేరటానికి కారణం ఏమిటి?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు జీవదత్తుడు, "మేం పుట్టి పెరిగిన గ్రామంలో మా శక్తి సామర్థ్యాలూ, నేర్చిన విద్యలూ ప్రదర్శించేందుకు అవకాశం లేదు. ఆ కారణంవల్ల తమ నగరానికి వచ్చి, మీ ఎదట మా విద్యలను చూపదలిచాం," అన్నాడు.

"ఈ విద్యా ప్రదర్శన అంతా ఎందుకోసం?" అన్నాడు రాజు.

ఆ మాటకు ఖడ్గవర్మ ముఖం ఎర్రబడింది. జీవదత్తుడు తన మిత్రుడి కేసి శాంత పడవలసిందన్న సూచనగా చిరునవ్వు నవ్వి, "మహారాజా! ఈ లోకంలో, అరణ్యాలకు పోయి తపస్సు చేసుకోవటం ఒక్కటి తప్ప, మనిషి చేసే తక్కిన పనులన్నీ పొట్ట పోసుకునేందుకే. మేం కీర్తి గౌరవాల ద్వారా యీ పని సాధించాలనుకున్నాం," అన్నాడు.

ఆ జవాబు విని రాజు, కూతురి కేసి చూశాడు. పద్మావతి మంత్రి సోమదేవుడి కేసి తల తిప్పి, "ఈ సమయంలో నేనిక్కడున్న కారణం ఏమిటో వారిద్దరికీ అర్థమయ్యే వుంటుంది," అన్నది.

ఖడ్గవర్మా, జీవదత్తుడూ ముఖముఖాలు చూసుకున్నారు. వారికి సంగతి సరిగా






నాకు సమఉజ్జీ అయినవాడు ఇంకొకడు లోకంలో వుంటాడని అనుకోను," అన్నాడు జీవదత్తుడు.

ఆ మాటలు వింటూనే రాజకుమారి పద్మావతి గిరుక్కున వెనుదిరిగి చెలికత్తె చేతిలో వున్న వస్తు వొకదానిని తీసుకుని, దాన్ని ఖడ్గ, జీవదత్తులు స్పష్టంగా చూసేందుకు వీలుగా పై కెత్తి పట్టుకుని, "ఇది, రాతిరథం! వింధ్యపర్వతాల్లో ఎక్కడో వున్న ఒక రాతిరథానికి ప్రతికృతి. నేను విన్న దాన్ని బట్టి, ఆ పర్వత పంక్తుల్లో వున్న ఆ రాతిరథాన్ని కదిలించినవాడు ప్రపంచంలో సాటిలేని మహావీరుడు. అతణ్ణే నేను వరిస్తాను," అన్నది.

అర్థం కాలేదని గ్రహించిన మంత్రి సోమదేవుడు, "యువరాణికి తగిన వరుణ్ణి తెచ్చేందుకు మహారాజుగారు చాలా శ్రమ పడుతున్నారు. ఆమె మహావీరుణ్ణి తప్ప వివాహమాడనని పట్టుపట్టి కూర్చున్నది," అంటూ, పద్మావతి తనను పెళ్ళాడ వచ్చిన ఎందరెందరు రాజకుమారుల్ని తిరస్కరించి పంపిందీ ఖడ్గ, జీవదత్తులతో చెప్పాడు.

"మహావీరుల సంగతి కొస్తే, నన్ను కత్తి యుద్ధంలో జయించగలిగినవాడు లేడు," అన్నాడు ఖడ్గవర్మ.

"నేను యుద్ధవిద్యలే కాకుండా మంత్రశాస్త్రం కూడా నేర్చినవాణ్ణి. ఆ రెంటిలో

పద్మావతి మాటలు రాజునూ, మంత్రినీ కూడా అమితంగా ఆశ్చర్య పరిచినై. ఇంత వరకూ ఆ రాతిరథం మాట వాళ్ళు విని వుండలేదు. రాజు ఆసనం మీదినుంచి లేచి కుమార్తె చేతిలో వున్న చిన్న రాతిరథాన్ని తీసుకుని అటూ యిటూ తిప్పి పరీక్షించసాగాడు. మంత్రి సోమదేవుడు పక్కన నిలబడి దాని కేసి వింతగా చూడసాగాడు.

జీవదత్తుడు, ఖడ్గవర్మతో చిన్నగా ఏదో మాట్లాడి, తరవాత మహారాజు కేసి తిరిగి, "మహారాజా, ఈ బొమ్మ రాతిరథం పోలికలే

వున్న పెద్ద రాతిరథం ఒకటి ఆ వింధ్య పర్వతాల్లో ఎక్కడో ఒక చోట వున్నదని ఖచ్చితంగా నమ్మటం ఎట్లా? దానికి రుజు వేమిటి?" అని అడిగాడు.

రాజు, కుమార్తె కేసి చూశాడు. పద్మావతి చిన్నగా నవ్వి, "దీనికి రుజువు మామూలు మనుషుల నుంచి కాక అమానుషశక్తుల ద్వారా నేను తెలుసుకున్నాను," అన్నది.

"యువరాణి కోసం కాకపోయినా, మేం మహావీరులం అని రుజువు చేసేందుకు వింధ్యపర్వతాల్లో వున్న ఆ రాతిరథాన్ని కనుక్కొని, కదిలించేందుకు బయలుదేరి పోతాం. కాని, ఆ రథం సంగతి చెప్పిన అమానుషశక్తు లేవో మేం తెలుసుకోవలసిన అవసరం వున్నది గదా, మహారాజా!" అన్నాడు జీవదత్తుడు.

"అవునమ్మా, ఆ సంగతేమిటో చెప్పటం ధర్మంగా వుంటుంది," అన్నాడు రాజు.

"ఇందులో దాయవలసిందేమున్నది, యువరాణీ?" అన్నాడు మంత్రి.

పద్మావతి గొంతు సవరించుకుని, "పోయిన పౌర్ణమి రోజున నేను మేడ మీద నిద్రపోతున్నాను. బాగా నడిరాత్రివేళ ఏదో శబ్దమై కళ్ళు తెరిచాను. ఆ సమయంలో పెద్ద రాక్షసాకారంలో వున్న నల్లని మేఘం





ఒకటి ఆకాశంలో కదుల్తూ, నేనున్నచోటుకు పైన ఒక్క క్షణకాలం ఆగింది. నేను భయంతో చెలికత్తెల్ని పిలవబోయేంతలో, ఆ ఆకారం కిందికి చేయి చాచింది. వెంటనే దభీమంటూ ఈ రాతిరథం నా పక్కన పడింది. ఆ పాటుకు చెలికత్తెలంతా లేచారు. ఆ నల్లని ఆకారం ఆకాశంలో అంతర్ధానమయింది. ఆ రథాన్ని పోలిన పెద్ద రాతి రథం వింధ్యపర్వతాల్లో వున్నదన్న సమాచారం గల చీటీ, దానికి కట్టబడి వున్నది. ఆ చీటీ తెప్పించమన్నారా?" అన్నది.

రాజూ, మంత్రీ ఏదో అనబోయేంతలో జీవదత్తుడు, "రాజకుమార్తె మాటలు సత్యం అనే మేం భావిస్తున్నాం. ఆకాశంలో అలా మేఘంలా ఎగిరినవాడు రాక్షసుడో, కిన్నెరుడో, విద్యాధరుడో....అయివుంటాడు. ఏదో స్వప్రయోజనాన్ని ఆశించే వాడు, యీ బొమ్మరాతిరథాన్ని రాకుమారి పక్కన జార్చిపోయాడు. సరే, యిక మాకు సెల విప్పించండి. ఉదయాన్నే మేం బయలు దేరి వింధ్యపర్వతాల్లో వున్న ఆ మూల రాతిరథాన్ని కనుక్కొని, దాన్ని కదిలించే ప్రయత్నం చేస్తాం," అన్నాడు.

"మీ యిద్దరి ధైర్యసాహసాలూ, తెలివి తేటలూ నేను కళ్ళారా చూసినవాణ్ణి. విజయులై శీఘ్రంగా రండి," అన్నాడు పద్మసేనమహారాజు.

"నేనూ, మిమల్ని విజయులై రండని, దీవిస్తున్నాను. మీ యిద్దరిలో ఎవరు గొప్ప వీరుడో అతణ్ణే రాకుమారి వివాహం ఆడుతుంది," అన్నాడు మంత్రి సోమదేవుడు.

జీవదత్తుడు ముందుకొక అడుగు వేసి, "ఆ బొమ్మరాతిరథాన్ని ఒకసారి చూడనివ్వండి. ఆ వింధ్యపర్వత ప్రాంతాల్లో పూర్వం అనేక మహానగరాలు పుట్టి, కాల క్రమాన మట్టిలో కలిసిపోయినై. అక్కడ వుండే శిథిలాల్లో అనేకమైన రాతిరథాలు వుండవచ్చు. మేం కదిలించవలసింది—

ఈ బొమ్మరథాన్ని పోలిన రాతిరథాన్ని గదా?" అన్నాడు.

రాజు, బొమ్మరాతిరథాన్ని జీవదత్తుడి చేతి కిచ్చాడు. దాన్ని అతడూ, ఖడ్గవర్మా బాగా పరీక్షించి చూసి, తిరిగి రాజుగారికి యిచ్చివేసి, సెలవు తీసుకుని తమ అతిథి గృహానికి వెళ్ళిపోయారు.

అప్పటికి రాత్రి చాలా పొద్దుపోయింది. ఖడ్గ, జీవదత్తులు హాయిగా నిద్రపోసాగారు. కొంతసేపటికి గదిలో ఏదో అలికిడి అవటంతో ముందుగా జీవదత్తుడు కళ్ళు తెరిచి చూశాడు. ఇద్దరు ముసుగు వ్యక్తులు గదిలో ఒక మూల వున్న కన్నం దగ్గిర నిలబడి వంగి చూస్తున్నారు. అంతలో మరొక ముసుగువాడు ఆ కన్నంలో నుంచి గది లోపలికి వచ్చాడు.

తమను చంపటానికి వచ్చిన హంతకులు వీళ్ళని తెలియగానే, జీవదత్తుడు, "ఖడ్గా! లే, హంతకులు!" అంటూ అరిచి, తలగడ పక్కనే వున్న దండాన్ని తీసుకున్నాడు.

ముసుగు వ్యక్తులు ముగ్గురూ ఒకేసారి కత్తులు దూశారు. వాళ్ళల్లో యిద్దరు జీవదత్తుడి కేసీ, ఒకడు యింకా నిద్రలేవని ఖడ్గవర్మ కేసీ దూకారు. జీవదత్తుడు తన మీది కురికే ముసుగువాళ్ళను తప్పుకుని, ఖడ్గవర్మ మీదికి పోబోతున్నవాణ్ణి తన



దండంతో తల మీద గట్టిగా ఒక్కదెబ్బ కొట్టాడు. ఆ దెబ్బకు వాడు కిక్కురుమన కుండా కిందపడిపోయాడు.

ఇంతలో ఖడ్గవర్మ లేచాడు. అది చూస్తూనే చచ్చినవాడు చావగా మిగిలిన ముసుగువాళ్ళిద్దరూ, చప్పున వెనుదిరిగి గోడ కన్నంలో నుంచి దూరి పారిపోజూశారు. అందులో ముందుగా ఒకడు దూరాడు. రెండవవాడు దూరి సగం కనబడకుండా పోయాడు. జీవదత్తుడు వాడి కాలొకటి పట్టుకుని ఎలుకను లాగినట్టు గది లోపలికి లాగి, గోడ పక్కకు విసిరివేశాడు.

"ఆ పారిపోయిన దుష్టుడి సంగతి నేను చూస్తాను," అంటూ ఖడ్గవర్మ కన్నంలో నుంచి దూరి బయిటికిపోయాడు.

ఆ సరికే ముసుగువాడు పరిగెత్తుతూ అతిథిగృహానికి చుట్టూ వున్న ప్రహరీ గోడను సమీపించాడు. ఖడ్గవర్మ అతణ్ణి హెచ్చరిస్తూ, "అగు! వెన్ను చూపిన శత్రువును నేను చంపను. కాని, దొరక్కుండా పోవాలని చూశావో చావు తప్పదు!" అన్నాడు.

అతడి మాటలు లక్ష్య పెట్టకుండా ముసుగు వ్యక్తి మరింత వేగంగా పరిగెత్తుతూ పోయి ఆరేడడుగుల ఎత్తున్న ప్రహరీ గోడ మీదికి ఎగిరాడు. అతడు చేతులతో గోడ పై భాగాన్ని పట్టుకుని, అవతలికి జారబోయేంతలో ఖడ్గవర్మ అక్కడికి చేరాడు. అతడికి ముసుగువాడి కాళ్ళు మాత్రమే కనిపిస్తున్నవి.

హంతకుడు తప్పుకుపోతున్నాడనే ఆదుర్దాలో ఖడ్గవర్మ ముసుగువాడి కాళ్ళల్లో ఒక దానికి గురి చూసి కత్తి విసిరాడు. ఆ కాలు తెగి ఠపీమంటూ కింద పడింది. అదే సమయంలో ముసుగువాడు దభీమంటూ గోడ అవతల పడిపోయాడు. ఆ సమయంలో రాత్రి గస్తీ తిరుగుతున్న రాజభటు లిద్దరు కేకలు పెడుతూ అక్కడికి పరిగెత్తుకు రాసాగారు. —(ఇంకా వుంది)






# జయాపజయాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్నిదించి భుజానవేసుకుని, ఎప్పటిలాకే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదల ఎంతో మెచ్చుకోదగినది. కాని ఒక్కొక్కప్పుడు ఎంతో సమర్థులు కూడా తమ పట్టుదలను విడిచిపుచ్చి అందుబాటులో ఉన్న ఫలితాన్ని చెయ్యి జారి పోనిస్తారు. ఇందుకు నిదర్శనంగా నీకు సువర్ణఖేటపుర యువరాజైన జయసింహుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

సువర్ణఖేటపుర రాజు శూరసేనుడు వ్యాధిగ్రస్తుడయాడు. ఆ కారణంచేత శూరసేనుడి కొడుకైన జయసింహుడు రాజ్యాధికారాన్ని చేపట్టి, తన యిష్టం వచ్చినట్టు అధికారం చలాయించసాగాడు.

## బేతాళ కథలు



జయసింహుడు స్వతహాగా అధికార దాహం కలవాడు. అందరినీ శాసించటం కన్న అతనికి ఇష్టమైనది మరొకటి లేదు. ఈ అధికారదాహం అతనికి తన రాజ్యంలో తీరలేదు, అందు చేత పరిసరాలలో ఉండే చిన్న చిన్న రాజ్యాల మీదికి సేనలను తీసుకుపోయి, యుద్ధాలు చేసి, ఆ చిన్న రాజ్యాలను జయించి, వాటిని తన రాజ్యంలో కలుపుకుని, తాను గెలిచిన రాజులందరినీ సామంతులుగా చేసుకుని, వారి పైన కూడా తన అధికారాన్ని నిలబెట్టసాగాడు.

ఈ కార్యక్రమంలో జయసింహుడు తోమరపుర మనే చిన్న అటవీ రాజ్యం మీదికి దండెత్తి వెళ్ళాడు. తోమరపుర రాజైన వీరోత్తుంగుడు తన కొద్ది సేనతో జయసింహుడి పెద్ద సేనలను ప్రతిఘటించి, ఓడిపోయాడు.

జయసింహుడు విజయుడై రాజభవనం ప్రవేశించి, సంధి జరిగేదాకా వీరోత్తుంగుణ్ణీ, అతని కుటుంబాన్నీ రాజభవనం దాటి వెళ్ళరాదని శాసించాడు. అతను వీరోత్తుంగుడి కుటుంబాన్ని పరిచయం చేసుకునేటప్పుడు అతని దృష్టి వీరోత్తుంగుడి కుమార్తె అయిన శరావతి పైన పడింది.

శరావతి అందగత్తె మాత్రమేగాక, మంచి ఆకర్షణ శక్తిగలది. ఆమె జయసింహుణ్ణి బలంగా ఆకర్షించింది. అప్పటి కింకా పెళ్ళి కాని జయసింహుడు, తనకు తగిన భార్య శరావతి మాత్రమేననీ, ఆమెను వదిలి మరొకతెను తన భార్యగా చేసుకోవటం అసంభవమనీ అనుకున్నాడు.

ఈ కారణం చేత అతను వీరోత్తుంగుడి పట్ల తన వైఖరి పూర్తిగామార్చుకుని, "మన మధ్య సంధి జరగవలసి ఉన్నది. వేరే షరతులు అనవసరం. మీ కుమార్తెను నా కిచ్చి పెళ్ళి చేసినట్టయితే, మీ రాజ్యం మీకు తిరిగి ఇచ్చేస్తాను. మనకు యుద్ధమే జరగలేదనుకుందాం," అన్నాడు.

"నా కుమార్తెతో మాట్లాడి చెబుతాను," అన్నాడు వీరోత్తుంగుడు.

ఆయన తన అభిప్రాయం అడిగినప్పుడు శరావతి, "నా పెళ్ళి గురించి నాకు ఏ అభిప్రాయమూ లేదు. మీరు ఎవరిని పెళ్ళాడమంటే వారిని పెళ్ళాడతాను," అన్నది.

"నిజానికి నిన్ను ఇతనికి ఇవ్వటం నాకు అంతగా ఇష్టంలేదు. చూడటానికి అందగాడే గాని, అతని అధికారదాహమూ, రాజ్యదాహమూ ఇంతా అంతా కాదని చెబుతారు. కఠిన శాసనుడని కూడా విన్నాను. నేను నిన్ను మనస్ఫూర్తిగా తన కివ్వకపోతే బలాత్కారంగా నైనా పెళ్ళాడగలడు. ఆ పైన చాలా కీడు చేయగలడు కూడా," అన్నాడు వీరోత్తుంగుడు కుమార్తెతో.

"అలాటప్పుడు అతని ఇష్టప్రకారమే చెయ్యండి," అన్నది శరావతి.

వీరోత్తుంగుడు జయసింహుడితో తన కుమార్తె పెళ్ళికి ఒప్పుకున్నట్టు తెలిపి, ముహూర్తం నిశ్చయించి, పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించాడు.

జయసింహుడు పెళ్ళి రోజు కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నాడు. అతనికి శరావతితో మాట్లాడాలని ఉన్నది గాని అవకాశం చిక్కలేదు.



ఒకనాడు శరావతి ఇద్దరుముగ్గురు చెలికత్తెలను వెంటబెట్టుకుని, నగరం వెలపల కొండ మీద ఉన్న కాళీ ఆలయానికి పూజ కోసం వెళ్లింది.

ఈ సంగతి తెలియగానే జయసింహుడు ఆమెను కలుసుకోవటానికి తాను కూడా ఒంటరిగా ఆ ఆలయానికి బయలుదేరాడు. కొండకాళీఆలయానికి వెళ్ళే దారికి అటూ ఇటూ అడవి ఉన్నది.

జయసింహుడు ఆ దారిన నడుస్తూ ఉండగా, ఆలయం నుంచి తన చెలికత్తెలతో తిరిగి వస్తున్న శరావతి ఎదురుపడింది. అతను ఆమెను సమీపించి, "నీతో ఏకాం



తంగా మాట్లాడదామని ఇలా బయలుదేరి వచ్చాను," అన్నాడు.

"అలాగే!" అన్నది శరావతి. ఆమె ఉద్దేశం గ్రహించి ఆమె చెలికత్తెలు వెనక్కు తగ్గి నిలిచిపోయారు.

"నేను నా జన్మలో ఏ స్త్రీనీ ప్రేమించి ఎరగను. నిను చూడగానే ప్రేమించాను. ఆ భావం న లో కలిగినాక నేను మీ రాజ్యాన్ని జయించటం ఏదో కలలాగా తోచింది. నువు నన్ను పెళ్ళాడటానికి ఒప్పుకున్నట్టు మీ నాన్నగారు చెప్పారు. కాని, నేను ఒక సంగతి తెలుసుకో గోరుతున్నాను. నువు నన్ను ప్రేమించే పెళ్ళికి ఒప్పుకున్నావా? లేక నేను యుద్ధంలో నీ తండ్రిని గెలిచానని ఒప్పుకున్నావా?" అని జయసింహుడు శరావతిని అడిగాడు.

"నాకు ప్రేమ అంటే ఏమిటో తెలీదు. మీరు గెలవటమూ, మా తండ్రి ఓడటమూ నాకు సంబంధించిన విషయాలు కావు. మా నాన్న నన్ను ఎవరి కిచ్చి పెళ్ళిచేస్తే వారిని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నాను." అన్నది శరావతి. తిరిగి జయసింహుడేదో అనబోయేంతలో వెనక నుండి శరావతి చెలికత్తెలు, "అమ్మయ్యో! పులి! పులి!" అని పెద్దగా కేకలు పెట్టారు.

శరావతీ, జయసింహులు వెనక్కు తిరిగి చూసేసరికి ఒక పులి దారి పక్క నుంచి వచ్చి దారిలో నిలబడి ఉన్నది. దూరాన ఉన్న చెలికత్తెలు వెనక్కు తిరిగి పారిపోతున్నారు. పులి వారి కేసి చూడక, శరావతీ, జయసింహులనే చూస్తూ కొంచెం సేపు నిలబడి, వారి కేసి పరిగెత్తుకుంటూ రాసాగింది.

"పారిపో!" అని శరావతికి కేక పెట్టి, జయసింహుడు దగ్గిర ఉన్న చెట్టెక్కాడు. పులి ఇంకా పదిబారల దూరాన ఉండగానే శరావతి భయంతో, నిలబడిన చోటనే కూలి పోయి మూర్ఛపోయింది.



ఆమె కూలిపోయే క్షణంలోనే ఎక్కడి నుంచో ఒక బాణం వచ్చి పులి డొక్కలో గుచ్చుకున్నది. మరుక్షణం అడవిలో నుంచి ఒక బోయయువకుడు పరిగెత్తుకుంటూ వచ్చి, చురకత్తితో పులి మీద కలియబడ్డాడు. వాడు పులిని చంపేలోపుగా పులి వాణ్ణి తీవ్రంగా పంజాదెబ్బలు కొట్టింది.

పులిని చంపి, శరీర మంతా రక్తప్రవాహాలు కారుతూ ఆ బోయయువకుడు శరావతిని సమీపించాడు. ఆమెకు స్పృహలేదు. వాడు ఆమెను తన చేతులలో ఎత్తుకుని, దాపులనేవున్న ఒక చిన్న నీటిమడుగు కేసి నడవసాగాడు.

అంతలో శరావతి స్పృహ తెలిసి వాడితో, "నన్ను దింపు. నేను నడవగలను," అన్నది.

వా డామెను కింద దింపాడు. ఆమె పులి కోసం అటూ ఇటూ చూసేసరికి కొంచెం దూరంలో పులికళేబరం కనబడింది. అప్పు డామె ఆ కుర్రవాడి కేసి నిలువునా చూసి, "అయ్యయ్యో, ఈ రక్తమంతా ఏమిటి? పులిని నువే చంపావా?" అని అడిగింది.

"అవును, సమయానికి వచ్చాను, లేక పోతే ఏమై ఉండేదో!" అన్నాడు బోయ యువకుడు.



"నాతోపాటు వచ్చెయ్యి. నీకు చికిత్స చేయిస్తాను," అంటూ శరావతి కదిలింది. ఇదంతా జయసింహుడు చెట్టు దిగి చూస్తూనే ఉన్నాడు.

పారిపోయిన చెలికత్తెలను కలుపుకుని, శరావతి, జయసింహుడి కేసి చూడనైనా చూడకుండా, బోయయువకుణ్ణి వెంటపెట్టుకుని తమ ఇంటికి వచ్చేసింది.

రాజవైద్యులు బోయయువకుడి గాయాలన్నీ కడిగి, మందులు వేసి, కట్టుకట్టి, రాజభవనంలోనే ఒక గదిలో పడుకో బెట్టారు.

జయసింహుడు శరావతికి చాలా వెనకగా రాజభవనానికి తిరిగి వచ్చాడు. అతను



ఆ రాత్రి వీరోత్తుంగుడితో, "నేను మీ అమ్మాయిని పెళ్ళాడే ఉద్దేశాన్ని మానుకున్నాను. మీకు అనవసరంగా శ్రమ ఇచ్చినటున్నాను. మీరు చేసిన పెళ్లి ప్రయత్నాలు వృథా పోకుండా మీ అమ్మాయికి తగిన వరుణ్ణి ఇచ్చి త్వరలోనే పెళ్ళి చేయండి. రేపు నేను నా సైన్యంతో సహా మా దేశానికి తిరిగి పోతున్నాను. మనకు యుద్ధం జరిగిందన్న మాట మీరు మరిచిపోండి. నేనూ మరిచి పోతాను," అన్నాడు.

వీరోత్తుంగుడు తన చెవులను తానే నమ్మలేక పోయినాడు. జయసింహుడిలో వచ్చిన మార్పు ఆశ్చర్యం కలిగించింది. చివరకు ఆయన, "మీ రన్న మాటలు మా అమ్మాయితో చెబుతాను," అన్నాడు.

ఆ రాత్రి కొంచెం పొద్దుపోయి శరావతి జయసింహుడి వద్దకు వచ్చి, "మీరు నన్ను పెళ్ళాడే ఆలోచన మానుకున్న మాట నిజమా?" అన్నది.

"అవును," అన్నాడు జయసింహుడు.

"మీరు నన్ను పులి రాక ముందు అడిగారు—నాకు ప్రేమ అంటే ఏమిటో తెలియదు, అని చెప్పాను. ఆ ప్రశ్నకు ఇప్పుడు మరో సమాధానం చెప్పగలను. నాకు ప్రేమ అంటే ఏమిటో తెలిసింది. నేను మిమ్మల్ని హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నాను. మీరు వెళ్ళిపోకండి!" అన్నది.

జయసింహుడు వెళ్ళిపోలేదు. అతను శరావతిని పెళ్ళి చేసుకున్నాడు. ఇద్దరూ సుఖంగా ఉన్నారు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా నా కొక సందేహం. శరావతి జయసింహుణ్ణి ప్రేమిస్తున్నానన్నమాట అబద్ధం కాదా? అతను వెళ్ళి పోతానంటే పీడ విరగడ అయిందని సంతోషించక, అతన్ని ఉండి పొమ్మని ఎందుకు అడిగింది? పులిని చంపిన బోయయువకుణ్ణి తన ఇంటికి తెచ్చేటప్పుడు ఆమె జయసింహుణ్ణి గురించి

ఆలోచించను కూడా లేదే. ఆమెకు అతని మీద ప్రేమ ఎప్పుడు పుట్టినట్టు? ఎందు కని పుట్టినట్టు? ఈ అనుమానాలకు సమా ధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "జయసింహుడు పరాక్రమ గర్వి. కాని అతను శరావతిని నిజంగా ప్రేమించాడు. అంతేకాదు, ఆమె తనను ప్రేమించాలని కూడా కోరాడు. ఆమె తనను ప్రేమిస్తున్నట్టు నిర్ధారణ చేసుకునే టందుకే అతను కొండ కాళీ ఆలయానికి బయలుదేరాడు. కాని, రాజ్యాలు జయించి నట్టు హృదయాలను జయించటం సాధ్యం కాదని అతనికి తెలియదు. ఆమె తనను ప్రేమించలేదన్న విచారమూ, పులి వచ్చి నప్పుడు తాను ఆమెను కాపాడలేకపోవ టమూ, ఆ పని ఒక బోయ కుర్రవాడు చేయటమూ అతన్ని నిరుత్సాహ పరిచి, అతను పెళ్ళి మానుకోవటానికి కారణ మయాయి. పోతే, శరావతి జయసింహుణ్ణి ప్రేమించటం అతను పెళ్ళి పోతాడని విన టంతో ఆరంభమయిందని చెప్పాలి. అతను తనను ప్రేమిస్తున్నాడనీ, తన ప్రేమ వాంఛిస్తున్నాడనీ పులి రాక ముందే ఆమె గ్రహించింది. కాని అతను బలాత్కారంగా తనను వివాహం చేసుకోగలిగి ఉండి కూడా ఆ పని చెయ్యటం మానుకున్నాడంటే అందుకు కారణం ప్రేమ తప్ప మరేమీ కాదని ఆమెకు తెలిసి వచ్చింది. బోయ యువకుణ్ణి తెచ్చేటప్పుడు ఆమె జయ సింహుడి విషయం పట్టించుకోలేదు. అతను తన క్షేమం చూసుకోగలడని అదివరకే రుజు వయింది. తన రక్షణకోసం గాయపడిన బోయ యువకుడి క్షేమం ఆమె తక్షణ కర్తవ్యం," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# వంచకులు

ఒక వర్తకుడు చనిపోతూ తన కొడుకైన జయదేవుణ్ణి దగ్గిరికి పిలిచి, "నాయనా, నువు ఏ వూళ్ళోనైనా వర్తకం చెయ్యిగాని కపిలనగరానికి మాత్రం వెళ్ళి వర్తకం చెయ్యకు," అని హెచ్చరించాడు.

తండ్రి పోయాక జయదేవుడు వర్తకం కొనసాగించాడు. ఒక నాడతను తన తల్లితో, "అమ్మా నేను కపిలనగరానికి వెళుతున్నాను," అన్నాడు.

"ఆ నగరానికి వెళ్ళవద్దని మీ నాన్నగారు చెప్పారు గదరా!" అన్నది తల్లి.

"వెళ్ళాలమ్మా. వర్తకం పని!" అన్నాడు జయదేవుడు.

అతనికి బోలెడంత చందనంచెక్క చవకగా లభించింది. దానికి కపిలనగరంలో మంచిగిరాకీ ఉన్నదని తెలిసి, అతను కపిలకు ప్రయాణమయాడు. నాలుగు మణుగులు తూగే చందనంచెక్క కట్టలను కంచరగాడిదల మీద వేసుకుని ప్రయాణమై జయదేవుడు ఒక రోజు సాయంకాలానికి కపిలనగరం చేరాడు. అప్పటికి చీకటి పడింది.

నగరం వెలపల ఒక సత్రం ఉన్నది. ఆ సత్రం వద్ద ఉన్న మనుషులు జయదేవుణ్ణి ఆపి, "ఈ రాత్రికి మీరు ఈ సత్రంలోనే ఉండటం మంచిది. ఈ పాటికి నగరంలో సత్రాలు మూసేస్తారు," అన్నారు.

వాళ్ళు ఇద్దరు మనుషులు. ఒకడు కుంటివాడు. రెండోవాడికి ఒకటే కన్ను. జయదేవుడు తెచ్చిన సరుకును వాళ్ళు దించి, సత్రం లోపల పెట్టారు. వారిలో కుంటివాడు, ఆ సరుకు చందనంచెక్క అని తెలుసుకుని, ఒక కట్ట తస్కరించి, అందులో సగం సత్రంలోని వంటగదిలో మూలపెట్టి, మిగతా సగం ఎత్తుకుపోయి పొయిలో పెట్టాడు.

పి. వేణుగోపాలరావు



తరవాత, జయదేవుడు భోజనానికి కూర్చున్నప్పుడు, ఆ కుంటివాడే అతని వద్దకు వచ్చి, "ఇంతకూ నీ వెంట తెచ్చిన సరుకు ఏమిటి?" అని అడిగాడు.

"చందనంచెక్క," అన్నాడు జయ దేవుడు.

"అయ్యో, పిచ్చివాడా! కపిలనగరానికి చందనంచెక్క తెచ్చావా? ఇక్కడ దానికి ధర రాదే! దాన్ని వంటచెరుకుగా వాడతాం. ఈ వూళ్ళో ఎవరి నడిగినా చందనంచెక్క ఊరికే ఇస్తారు. కావలిస్తే చూడు!" అంటూ కుంటివాడు పొయిలో కాలుతున్న చందనంచెక్కను తెచ్చి చూపాడు.

జయదేవుడు హతాశుడై పోయాడు. అతని ముఖాన విషాదం గమనించి కుంటి వాడు, "చాలాదూరం నుంచి ఎంతో శ్రమ పడి సరుకుతో వచ్చావు. దీన్ని మళ్ళీ తీసుకుపోవటం నీ కెంత బాధో నేను తెలుసుకో గలను. మా నగరాన్ని బతికున్నంత కాలమూ తిట్టుకుంటావు. అది నా కిష్టంలేదు. నీకు అభ్యంతరం లేకపోతే ఏడు మొహరీలకు నీ సరుకు నేనే కొంటాను. నీకు దారిఖర్చు లన్నా గిట్టుబాటు అవుతాయి," అన్నాడు.

జయదేవుడు అలా చేయటమే మంచి దేమో ననుకున్నాడు.



మర్నాడు ఉదయం అతను నగరం చూదామని బయలుదేరాడు. ఇంత దూరం వెళ్ళి లాభసాటిగా వర్తకం చెయ్యకపోగా నగరమైనా చూడకుండా పోతే తనని చూసి అంతా నవ్వుతారని అతనికి తోచింది.

అతను నగరంలోని ఒక దుకాణంలోకి ప్రవేశించాడు. దుకాణందారు వయసు మళ్ళినవాడు. చాలా మంచివాడుగా కనిపిం చాడు. ఆయనతో జయదేవుడు, "వ్యాపారం బాగా వున్నదా బాబుగారూ? నేనూ వర్త కుణ్ణే, మాది ఫలానా నగరం," అన్నాడు.

ఇద్దరూ కాస్సేపు మాట్లాడుకున్నారు. మధ్యలో జయదేవుడు, "ఇక్కడ చందనం



చెక్క ఎలా దొరుకుతున్నది?" అని దుకాణందారును అడిగాడు.

"ఎంత కావాలి, నాయనా?" అని దుకాణందారు అడిగాడు.

"నాలుగైదు మణుగులు," అన్నాడు జయదేవుడు.

"నాలుగైదు మణుగులే! ఊరంతా గాలించినా నీకు కట్టెడు దొరకదు, బాబూ!" అన్నాడు దుకాణదారుడు.

జయదేవుడు నిర్ఘాంతపోయాడు. అతను దుకాణదారుతో, "నాకు పెద్ద కష్టం వచ్చి పడింది, బాబుగారూ!" అంటూ తాను దిగిన సత్రంలో జరిగినదంతా చెప్పాడు.

అంతా విని ఆ దుకాణదారు, "నాయనా, ఊరిబయట ఉన్న ఆ సత్రంలో ఇద్దరు దొంగ వెధవలున్నారు. వాళ్ళు అందరినీ మోసం చేస్తారు. వాళ్ళలో ఒకడు కుంటి వాడు, రెండోవారు ఒంటి కంటివాడు. వాళ్ళ మోసాలకు విరుగుడు చెప్పగలవాడు ఒకడే ఉన్నాడు. వాడు సత్రం వంటవాడు. వాణ్ణి మంచి చేసుకో," అని సలహా ఇచ్చాడు.

జయదేవుడు సత్రానికి తిరిగి వెళ్ళి, అక్కడి వంటవాడి సహాయం కోరుతూ, డబ్బు ఇస్తానన్నాడు.

"నాకు డబ్బేమీ అవసరం లేదు. ఇవాళ రాత్రి మోసగాళ్ళు ఒక జోస్యుణ్ణి కలుసుకుని, మాట్లాడుతారు. ఆ సమావేశం నీ గది పక్కన ఉండే గదిలోనే జరుగుతుంది. వాళ్ళ సంభాషణ శ్రద్ధగా ఆలకించి, నీకు, చాతనైనది చెయ్యి," అని వంటవాడు సలహా ఇచ్చాడు.

జయదేవుడు ఆ రాత్రి పక్కగదిలో జరిగే సంభాషణ అంతా విన్నాడు.

"కొత్తగా ఒక వర్తకుడు వచ్చాడు. అతని దగ్గిర ఉన్న చందనం చెక్కను ఏడు మొహరీలకు కొంటున్నాం. దాని మీద మాకు ఏ పాటి లాభం వస్తుంది?" అని మోసగాళ్ళు జోస్యుణ్ణి అడిగారు.

" ఈ వర్తకుడు ఇంతదూరం వచ్చాడంటే వెర్రివాడై ఉండడు. వాడు తనకు ఏడు మొహరీలు వద్దనీ, ఏడు మానికల ఈగలు ఇవ్వమనీ అంటే మీరేం చేస్తారు?" అన్నాడు జోస్యుడు.

"అటువంటి ఆలోచన వాడికి ఎందుకు వస్తుంది?" అన్నారు మోసగాళ్ళు.

తెల్లవారగానే జయదేవుడు నగరంలోని న్యాయాధికారి వద్దకువెళ్ళి, "అయ్యా, నేను వర్తకం చేసుకునేటందుకు ఈ నగరం వచ్చాను. నావద్ద ఉన్న చందనం చెక్కను ఊరిబయటి సత్రంలో ఉండే ఇద్దరు మనుషులు కొంటామన్నారు. నేను వెంటనే మా దేశానికి తిరిగి వెళ్ళాలి. తమరు నా సరుకు మూల్యం ఇప్పించాలి," అన్నాడు.

న్యాయాధికారి మోసగాళ్ళను ఇద్దరినీ పిలిపించి, " ఈ పెద్దమనిషి సరుకు కొంటామన్నారుట, ధర ఇచ్చి ఆయనను పంపరాదా?" అని అడిగాడు.

" మేం ఆ సరుకుకు ఏడు మొహరీలు ఇస్తాం," అన్నారు మోసగాళ్ళు.

" నాకు బంగారం అవసరం లేదు. నా సరుకు ధర ఏడు మానికల ఈగలు," అన్నాడు జయదేవుడు.

మోసగాళ్ళు నిర్ఘాంతపోయి, ఒకరి మొహాలు ఒకరు చూసుకుని, తమ కీ బేరం



వద్దన్నారు. జయదేవుడు తన సరుకును నగరంలో మంచి ధరకు అమ్ముకున్నాడు.

ఆ రోజే ఒంటికంటివాడు నగరంలో మరొక న్యాయాధికారి వద్దకు వెళ్ళి, "అయ్యా, జయదేవు డనేవాడు వర్తకం కోసమని వచ్చి ఊరిబయట సత్రంలో దిగాడు. అతనిది మా వూరే. ఆ అబ్బాయి పుట్టినప్పుడు అతనికి ఒక కన్ను లేదు. అతని తండ్రి అందుకు విచారిస్తూంటే, నేను నా కన్ను ఒకటి అరువిచ్చాను. ఇప్పు డతను జీవితంలో స్థిరపడ్డాడు గనక నా కన్ను నాకు తిరిగి ఇప్పించండి," అన్నాడు.

ఆ న్యాయాధికారి జయదేవుణ్ణి పిలిపించి, "నువు ఒక్క కన్నుతో పుట్టితే ఈ మనిషి నీకు తన కన్ను ఒకటి అరువిచ్చాడుట. దాన్ని ఇప్పుడు తిరిగి ఇయ్యమంటున్నాడు. ఏమంటావు ?" అని అడిగాడు.

"ఈ మనిషిని నే నెన్నడూ చూడలేదు," అన్నాడు జయదేవుడు.

"అతనిది మీ వూరేనట. మీ నాన్నగారిని ఎరుగునట. తన రెండో కన్నును నీ కిచ్చాడట," అన్నాడు న్యాయాధిపతి.

జయదేవుడు కొంచెం ఆలోచించి, "అదంతా నిజమో, కాదో తెలుసుకోవటం మంచిది. అతని కన్ను పీకమనండి. నాది కూడా పీకుతాను. రెండూ తూచి, వాటి బరువూ ప్రమాణమూ ఒకటిగా వుంటే నా కన్ను అతని కిచ్చేస్తాను," అన్నాడు.

"అలాగే చేద్దాం," అన్నాడు న్యాయాధికారి. ఒంటి కన్నువాడికి ఠారెత్తింది.

"ఎందుకు పోనివ్వండి. ఒకసారి దానం చేసినది మళ్ళీ తీసుకోవటం ఏ ఘంత బాగుండదు," అని ఒంటి కన్నువాడు జారుకున్నాడు.

ఈ విధంగా మోసగాళ్ళ నుంచి బయటపడి, తాను వచ్చిన పని ఎలాగో పూర్తి చేసుకుని జయదేవుడు తన ఊరికి తిరిగి వెళ్ళిపోయాడు.





# పందెం వద్దు!

పూర్వం కమలాపురరాజ్యాన్ని పాలించిన కమలధ్వజుడికి శూరధ్వజుడు అనే కొడుకూ, శాలిని అనే కుమార్తే ఉండేవారు.

శూరధ్వజుడు పేరుకు తగినట్టు మహా శూరుడు. అతను అన్ని వీరవిద్యలూ అభ్యసించి ప్రవీణుడయాడు. అనేక యుద్ధాలలో ముందు నిలిచి పోరాడి విజయం పొందాడు. అతను ఓటమి అన్నది ఎరగడు. అతని పేరంటే శత్రువులకు సింహస్వప్నంగా ఉండేది.

కమలధ్వజుడు శూరధ్వజుణ్ణి యువరాజుగా అభిషేకించి, తాను పేరుకు మాత్రమే రాజుగా ఉంటూ, రాజ్యభారమంతా కొడుకుకే వదిలేశాడు.

ఇలా ఉండగా శాలిని యుక్తవయస్కురాలయింది. రాజు ఆమె కోసం తగిన వరుణ్ణి వెతికే ఆలోచనలో పడ్డాడు. ఈ సంగతి తెలిసి శూరధ్వజుడు, "నా చెల్లెలిని మహావీరుడికి తప్ప ఇవ్వగూడదు. నన్ను గెలిచినవాడికే ఆమె నిచ్చి పెళ్ళిచేద్దాం," అన్నాడు తండ్రితో.

"నీ ఆలోచన బాగానే ఉన్నది, కాని పోటీ నీతో కాకుండా మరొక వీరుడితో ఏర్పాటు చేద్దాం," అన్నాడు రాజు.

ఇందుకు శూరధ్వజుడు ఒప్పుకోక, శాలినిని పెళ్ళాడేవాడు తననే జయించాలని పట్టుబట్టాడు. ఆ విధంగా అతను ప్రకటన కూడా చేయించాడు.

కొంతకాలంపాటు రాజకుమారు లెవరూ ముందుకు రాలేదు. శూరధ్వజుణ్ణి జయించగలమన్న నమ్మకం వారికి లేకపోయింది. కాని చివరకు, శామలదేశపు రాజకుమారుడు వాయువర్మ అనేవాడు, శూరధ్వజుణ్ణి జయించి శాలినిని పెళ్ళాడతానని వచ్చాడు.

వాయువర్మ అన్నివిధాలా శాలినికి తగిన వరుడని రాజుకు తోచింది. శాలిని కూడా

టి. రామసుబ్బయ్య



అతన్ని తన భర్తగా వరించటానికి సిద్ధపడింది. అయితే ముందుగా వాయువర్మ శూరధ్వజుడితో పోటీచేసి గెలవవలిసి ఉన్నది. ఆ పోటీకి ఒక మంచి రోజు నిర్ణయించి, వాయువర్మకు రాజభవనంలోనే బస ఏర్పాటుచేశారు.

అయితే, రేపు పోటీ అనగా ఒక దుర్ఘటన జరిగింది. రాజకుమారి శాలిని ఉద్యానంలో ఉండగా కొందరు దుర్మార్గులు, ఆమెను బంధించి, ఎత్తుకుపోయారు.

ఇది జరిగినప్పుడు శూరధ్వజుడు ఇంట లేనందున, అతనికి ఈ వార్త ఆలస్యంగా తెలిసింది. ఈ లోపల రాజభటులు రాజకుమార్తె కోసం వెతికారు గాని, ఫలితం లేకపోయింది.

శూరధ్వజుడు వాయువర్మను పిలిపించి, "నా చెల్లెలిని ఎవరో దుర్మార్గులు ఎత్తుకుపోయారు. ఆమెను వెతికి తీసుకురావటానికి పోతున్నాను. మన పందెం మాట తరవాత చూసుకుందాం," అన్నాడు.

"ఆమెను వెతకటానికి నేను కూడా వస్తాను. ఆ దుర్మార్గుల నెత్తురు కళ్ళచూడవలసిందే!" అన్నాడు వాయువర్మ.

ఇద్దరూ ఆయుధాలు ధరించి బయలుదేరారు. వారు మొదట ఉద్యానానికి వెళ్ళారు. అక్కడ పరిశోధించగా, శాలినిని దుర్మార్గులు ఎటుగా తీసుకుపోయినదీ తెలిసిపోయింది. బుద్ధిశాలిని అయిన శాలిని తాను పోగుచేసిన పూలను దారివెంట వేసింది. ఆ పూలు కనిపించిన దారినే శూరధ్వజుడూ, వాయువర్మా వెళ్ళి, నగరానికి చాలా దూరంగా ఒక చెట్టు కింద కూర్చుని ఉన్న ఒక యోగిని చేరారు.

యోగిని దాటినాక పూలజాడ కానరాలేదు. ఒకవేళ శాలిని వద్ద ఉన్న పూలు అయిపోయి ఉండవచ్చు. అందుచేత యువకులిద్దరూ యోగి వద్దకు తిరిగివచ్చి, "అయ్యా, ఇటుగా ఎవరైనా ఒక స్త్రీని

బలాత్కారంగా తీసుకువచ్చారా?" అని అడిగారు.

"అవును, నలుగురు బలాఢ్యులు ఒక స్త్రీని మోసుకురావటం చూశాను. నేను వాళ్ళకు బుద్ధి చెప్పాను గాని, వాళ్ళు నా మాటలు లక్ష్యపెట్టక, ఇలా అరణ్య మార్గం పట్టి వెళ్ళారు," అన్నాడు యోగి.

అడవిదారి తిన్నగా ఒక కొండగుహను చేరింది. గుహద్వారానికి కొంచెం లోపలగా పూలచెండు ఒకటి కనిపించింది.

"దుర్మార్గులు శాలినిని ఈ గుహలో దాచి ఉంచారు. నేను వెళ్ళి ఆమెను విడిపించుకు వస్తాను," అన్నాడు వాయువర్మ.

"అలా కాదు, నువు ఇక్కడే ఉండు. నేనే ఆమెను విడిపించుకు వస్తాను," అంటూ శూరధ్వజుడు ఒర నుంచి కత్తిదూసి గుహలోకి జొరబడ్డాడు.

అతను లోపలికి వెళ్ళిపోగానే ఒక పెద్ద కొండరాయి అతనికి వెనకగా పడి, గుహ ద్వారాన్ని మూసివేసింది.

గుహ వెలపల ఉన్న వాయువర్మకు ఒక స్త్రీ ఆర్తనాదం వినపడింది. అతను ఆ నాదం వినపడిన దిక్కుగా వెళ్ళి, చెట్టుకు కట్టి ఉన్న శాలినినీ, ఆమెను బెదిరిస్తున్న నలుగురు బలాఢ్యులనూ చూశాడు. వారిలో ముఖ్యుడులాగా ఉన్నవాడు శాలినితో,



"వెర్రిదానా, నిన్ను రక్షించటానికి వచ్చిన వీరులను నా మనుషులు గుహలో బంధించారు. ఇక నువు నన్ను పెళ్ళాడక తప్పదు. నిన్ను నా నుంచి రక్షించేవా రెవరూలేరు!" అంటున్నాడు.

వాయువర్మ కత్తి దూసి ఆ మాటలన్న వాడిపైన పడ్డాడు. ఆ దుర్మార్గులు నలుగురూ ఏకమై అతన్ని ఎదిరించారు. కొంత సేపు వారు ఆత్మరక్షణ మాత్రం చేసుకుని, ఆ తరవాత, కూడబలుకుకున్నట్టుగా, అరణ్యంలోకి పారిపోయారు.

వాయువర్మ శాలిని కట్లు విప్పి, ఆమెను వెంటబెట్టుకుని శూరధ్వజుడు బంధింపబడ్డ గుహ వద్దకు వచ్చాడు.

అదేసమయానికి అదృష్టవశాన అరణ్యవాసులు కొందరు అటుగావచ్చి, గుహద్వారానికి అడ్డంగా ఉన్న రాతిని తొలగించి, లోపల చిక్కుకుపోయిన శూరధ్వజుణ్ణి విడిపించారు.

తరవాత శూరధ్వజుడూ, వాయువర్మా, శాలినిని వెంటబెట్టుకుని రాజభవనానికి తిరిగివచ్చారు.

రాజు పురోహితుణ్ణి పిలిపించి, శాలినిని వాయువర్మ కిచ్చి వివాహం చెయ్యటానికి ముహూర్తం నిర్ణయించమన్నాడు.

"పోటీలో అతను నన్ను గెలిచిన తరవాత కదా వివాహం? శాలినిని దొంగలు ఎత్తుకుపోకపోతే ఇవాళ మా పోటీ జరగవలిసింది," అన్నాడు శూరధ్వజుడు.

"మీ పోటీ ఇవాళ జరిగింది. నన్ను విడిపించటానికి నీతో అతను పోటీచేసి నెగ్గాడు. ఇక వేరే పోటీ అవసరంలేదు," అన్నది శాలిని.

శూరధ్వజుడు సిగ్గుపడి తల వంచుకున్నాడు. శాలినిని దొంగలు ఎత్తుకుపోవటమంతా నాటకమనీ, రాజూ, శాలినీ కలిసి ఈ నాటకమంతా ఆడారనీ అతనికి తెలియదు!






# మాయదారి ముసలిది

## 6

జూరేక్ చేపలదుకాణంలో ఉన్న దీనారాల మూట కాజెయ్యటానికి "పాదరసం" చేసిన రెండు ప్రయత్నాలూ వృథా అయాయి. అయినా అతను తన ప్రయత్నం మానక, పాములవాడి వేషం వేసుకుని, బుట్టలో మూడు తాచులను పెట్టుకుని వచ్చి, వాటిని జూరేక్ దుకాణం ముందు ఆడించసాగాడు.

"పాదరసం" పాములను ఆడిస్తూనే, ఒక పామును జూరేక్ పాదాల ముందు పడేటట్టు దుకాణంలోకి విసిరివేశాడు. జూరేక్ బెదిరి లోపలికి పారిపోయాడు.

ఆ గలభాలో "పాదరసం" దీనారాల సంచిని పట్టుకున్నాడు. అయితే అంతలోనే జూరేక్ సీసంగుండ్లు తెచ్చి, ఒక దానితో పాము తల చితకగొట్టి, రెండో దాన్ని "పాదరసం" కేసి బలంగా విసిరాడు. "పాదరసం" తప్పుకున్నాడు. గుండు వీధిలోకి వెళ్ళి, వీధినపోయే ఒక ముసలిదానికి తగిలింది. ముసలిది అక్కడే ప్రాణాలు విడిచింది.

అక్కడ చేరిన జనం జూరేక్‌ను చంపటానికి వచ్చారు. జూరేక్ భయపడి, తన దుకాణం వాకిలి నుంచి దీనారాల సంచీ తీసెయ్యటానికి ఒప్పుకుని, దాన్ని తీసుకుపోయి తన వంటింట పూడ్చిపెట్టాడు.

సంచీతో పని అయిపోయింది గనక అందులో ఉన్న డబ్బు తమ కొడుకు పుట్టిన రోజు పండగకు ఖర్చు చేద్దామన్నది జూరేక్ భార్య. అందుకు జూరేక్ ఒప్పుకోలేదు.

ఆ రాత్రి జూరేక్‌కు ఒక కల వచ్చింది. కలలో ఏదో పక్షి, వంటింట్లో ముక్కుతో తవ్వి, దీనారాల సంచీని పైకి లాగుతున్నది.

"ఏదో పక్షి వంటింట్లో ముక్కుతో తవ్వుతున్నది, చూడవే!" అన్నాడు జూరేక్ తన భార్యతో.

ఆర్. నాగభూషణం





అని భర్తను తిట్టుతూ జురేక్ భార్య శోకాలు పెట్టింది.

"ఆ డబ్బు పోదులే. ఇప్పుడు తీసుకు రానూ?" అంటూ జురేక్ ఇంటి నుంచి బయలుదేరాడు.

"డబ్బు లేకుండా తిరిగి వచ్చావో, నీకు తలుపు తెరవను," అని జురేక్ భార్య వెనక నుంచి కేక పెట్టింది.

దీనారాల సంచీ కోసం మూడుసార్లు ప్రయత్నించిన దెవరో జురేక్‌కు స్పష్టంగా తెలుసు. ఆ కుర్రాడు అహ్మద్ ఇంట ఉంటున్న మాట కూడా ఆయన ఎరుగును. అందుచేత ఆయన అడ్డదార్ల వెంబడి త్వరగా అహ్మద్ ఇల్లు చేరి, మారుతాళం చెవితో బయటి తలుపు తెరిచి, లోపలికి వెళ్ళి మళ్ళీ తలుపు మూసి, పాదరసం రాక కోసం ఎదురు చూడసాగాడు.

కొద్దిసేపట్లో పాదరసం వచ్చి తలుపు తట్టాడు.

జురేక్ అహ్మద్ కంఠస్వరాన్ని అను కరిస్తూ, "పాదరసం, నువేనా? .... సంచీ తెచ్చావా?....ఏదీ? తలుపు కిందుగా లోప లికి తొయ్యి! నేనూ, హసనూ పందెం వేసు కున్నాంలే! గమ్మత్తయిన పందెం! తలుపు తెరిచి అంతా చెబుతా!" అన్నాడు.

జురేక్ భార్య దీపం తీసుకుని వంటింట్లోకి వెళ్ళి, కిటికీలో నుంచి ఎవరో బయటికి దూకి పారిపోతూండటం చూసింది. ఆ పారిపోయే మనిషి చేతిలో దీనారాల సంచీ ఉన్నది.

ఆ దొంగ "పాదరసం" అలీయే. జురేక్ దుకాణం నుంచి సంచీని దించినాక, "పాద రసం" అక్కడే తచ్చాడి, దాన్ని జురేక్ వంట ఇంట పాతెయ్యటం గమనించి, ఆ రాత్రి వచ్చి దాన్ని కాస్తా తవ్వి తీసుకు పోయాడు.

"నీ నోరుబడ! డబ్బు పిల్లవాడి పుట్టిన రోజుకు ఖర్చు చేద్దామంటే పల్లకాదన్నావు. ఇప్పుడు దాన్ని దొంగ దోచుకుపోయాడు,"



తలుపు అవతల ఉన్నది అహ్మదే అని నమ్మి, "పాదరసం" తాను తెచ్చిన సంచీని తలుపు కిందుగా లోపలికి తోశాడు.

జూరేక్ దాన్ని తీసుకుని, మెట్లెక్కి అహ్మద్ ఇంటి మిద్దె మీదికి పోయి, ఆ మిద్దె మీది నుంచి మరొక ఇంటి మిద్దెకు పోయి, ఆ ఇంటి మెట్లు దిగి, తలుపు తెరుచుకుని వీధిలోకి వెళ్ళి, ఇంటిదారి పట్టాడు.

"పాదరసం" ఒకటి రెండుసార్లు తలుపు తట్టి చూశాడు. ఏ అలికిడీ లేదు. జూరేక్ తనను మోసగించి ఉంటాడా అని అతనికి అనుమానం కలిగింది. వెంటనే పరిగెత్తుతూ అడ్డదార్ల వెంట జూరేక్ ఇల్లు చేరాడు. అతను లోపల ప్రవేశించి చూస్తే, మేడ మీది గదిలో జూరేక్ భార్య పిల్లవాణ్ణి పెట్టుకుని నిద్ర పోతున్నది.

ఆమె లేచే లోపల పాదరసం ఆమె చేతులూ, కాళ్ళూ కట్టేసి, పిల్లవాణ్ణి ఒక తట్టలో పడుకోబెట్టి, జూరేక్ రాక కోసం నిలబడ్డాడు.

ఇంతలో జూరేక్ ఇల్లు చేరుకుని తలుపు తట్టాడు.

"పాదరసం" జూరేక్ భార్య కంఠాన్ని అనుకరిస్తూ, "సంచీ దొరికిందా?" అని అడిగాడు.




"దొరక్కొంచేస్తుంది! ఇదుగో, తెచ్చాను," అన్నాడు జూరేక్.

"సంచీని బుట్టలో పెట్టు. డబ్బు లెక్క చూసుకుని మరీ తలుపు తెరుస్తాను," అంటూ పాదరసం ఒక బుట్టకు తాడుకట్టి కిందికి దించాడు. జూరేక్ తన దీనారాల సంచీని ఆ బుట్టలో పెట్టాడు.

పాదరసం ఆ బుట్టను చేదుకుని, దీనారాల సంచీనీ, పిల్లవాడున్న తట్టనూ తీసుకుని, ఇళ్ళకప్పుల మీదుగా అహ్మద్ ఇంటికి వెళ్ళిపోయాడు.

ఎంతకూ తలుపు తెరుచుకోకపోవటం చూసి జూరేక్ తన తలవాకిలి తలుపును




బాదసాగాడు. చుట్టుపక్కలవాళ్ళంతా పోగయారు. చివరకు నలుగురూ కలిసి తలుపు పడదోసి, లోపలికి వెళ్ళి చూసేసరికి, జురేక్ భార్య మంచానికి కట్టేసి ఉన్నది.

డబ్బుసంచీ జాడలేదు. పిల్లవాడూ లేడు.

జురేక్ తన భార్య కట్లువిప్పి, ఆమె ద్వారా జరిగినదంతా తెలుసుకున్నాడు. ఆయన జుట్టు పీక్కుని, అహ్మద్ ఇంటికి వెళ్ళి, తలుపు తట్టాడు.

అప్పటికి తెల్లవారుతున్నది. అహ్మద్ ఇంట అందరూ మేలుకునే ఉన్నారు.

జురేక్ "పాదరసం" అలీని చూస్తూనే, "డబ్బుసంచీ నువు గెల్చుకున్నావు, నువే ఉంచుకో. కాని నా పిల్లవాణ్ణి నా కిచ్చెయ్యి, నీకు పుణ్యం ఉంటుంది!" అన్నాడు.

హసన్ జురేక్‌తో, "తొందరపడకండి. మీ డబ్బుసంచీ ఎక్కడికీ పోదు. మీ పిల్లవాడూ ఎక్కడికీ పోడు. మావాడికీ, మీ మేనగోడలు జీనాబ్‌కూ పెళ్ళి ఖరారు చేసి మరీ వెళ్ళండి!" అన్నాడు.

"ఏమిటి మీరనేది? జీనాబ్‌ను అలీ కిచ్చి పెళ్ళిచెయ్యటానికి నాకేం అభ్యంతరం? కాని జీనాబ్ సంతలో కొనే గొర్రె పిల్లలాటిది కాదు. దాన్ని పెళ్ళాడ గోరినవాడు తగిన భరణం ఇవ్వవలసి ఉంటుంది," అన్నాడు జురేక్.

"ఆ భరణం ఏమిటో చెప్పండి, తప్పక ఇస్తాను," అన్నాడు "పాదరసం".

"అజరయ్య కూతురు కమర్ దగ్గిర ఉన్న బంగారు దుప్పటీ, ఆమె ధరించే బంగారు శిరోభరణమూ, బంగారు వడ్డాణమూ, బంగారు చడావులూ తెచ్చి ఇచ్చిన వాణ్ణి జీనాబ్ లక్షణంగా పెళ్ళాడుతుంది," అన్నాడు జురేక్.

"అలాగే తెచ్చి ఇస్తాను," అన్నాడు "పాదరసం".

జురేక్ తన డబ్బుసంచీనీ, పిల్లవాణ్ణీ తీసుకుని వెళ్ళిపోయాడు.

హసన్ పాదరసం కేసి తిరిగి, "నువు ఈసారి తలకు మించిన పని మీద వేసు కున్నావు. అజరయ్యా అంటే ఏమిటను కున్నావు? అతను మంత్రాలూ, చేతబడులూ చేయగలవాడు. అతనికి భూతపిశాచాలు పలుకుతాయి. అతను తన ఇంటిని బాగ్దాదు నగరం వెలపల, వెండి, బంగారు ఇటుక లతో కట్టించాడు. అతను పగలల్లా నగరంలో వడ్డీ వ్యాపారం చేసి, రాత్రి ఇంటికి వస్తాడు. రాత్రిపూట అతను ఇంట్లో ఉన్నప్పుడు తప్పిస్తే అతని ఇల్లు ఎవరికీ కనిపించదు. రాత్రివేళ అతను ఇంటికి రాగానే, గవాక్షంలో నిలబడి, ఒక బంగారు పళ్ళెంలో తన కుమార్తె బంగారు దుప్పటి ఉంచి చేత పట్టుకుని, 'ఇరాక్, ఇరాన్, అరేబియాలలో గల ఏ గజదొంగ అయినా సరే దీన్ని చాతనైతే కాజెయ్యవచ్చు," అని ప్రకటిస్తాడు. ఎంతమందో గజదొంగలు ఆ దుప్పటి కాజెయ్యాలని ప్రయత్నించి నాశనమై పోయారు. నిన్ను కూడా నాశనం చెయ్యాలనే ఉద్దేశంతోనే జురేక్ ఈ పెటకం పెట్టాడు!" అన్నాడు.

"మాట ఇచ్చేశాను. జీనాబ్‌ను పెళ్ళికూతుర్ని చేసినప్పుడు ఆ బంగారు దుప్పటి కప్పి, బంగారు శిరోభరణం పెట్టి, బంగారు వడ్డాణం చుట్టి, బంగారు చడావులు తొడిగి





మరీ పెళ్ళాడతాను," అన్నాడు "పాదరసం" ధైర్యంగా.

అతను అప్పటికప్పుడే బయలుదేరి, నగరంలో ఉన్న అజరయ్యా దుకాణానికి వెళ్ళాడు. అజరయ్యా దుకాణం మూసేదాకా అతను దూరంగా వేచి ఉన్నాడు. అజరయ్యా బంగారాన్ని తూయించి, సంచులలో పెట్టి గాడిద మీద వేయించి, దుకాణం మూసి, ఆ గాడిద నెక్కి బయలుదేరగానే, "పాదరసం" ఆయన వెనకగా నగరం వెలపలికి వెళ్ళాడు.

అజరయ్యా ఒకచోట ఆగి, తన చేతి సంచీలో నుంచి ఇసుక తీసి, మంత్రించి,



గాలిలో చల్లాడు. వెంటనే ఆయన ఎదట ఒక భవనం ప్రత్యక్షమయింది. అదే వెండి, బంగారు ఇటుకలతో కట్టిన భవనం. అజరయ్యా గాడిదతో సహా భవనం ప్రవేశించాడు.

కొంతసేపయాక ఆయన కిటికీ వద్ద కనిపించాడు. ఆయన చేతిలో ఒక బంగారు పళ్ళెమూ, అందులో ఒక బంగారు దుప్పటీ ఉన్నాయి. ఆయన పళ్ళెం పట్టుకుని, "ఇరాక్, ఇరాన్, అరేబియాలలో గల గజదొంగలారా! చేతనైతే ఈ నా కుమార్తె సొత్తు దొంగిలించి, ఆమెను పెళ్ళాడండి!" అని కేకపెట్టాడు.

అజరయ్యాను మంచిగా అడిగి ఆ వస్తువులు తీసుకుందామని "పాదరసం" అలీకి తోచింది. అతను కింది నుంచి, "అయ్యా, తమతో కాస్త మాట్లాడాలి!" అన్నాడు.

"పైకి రా," అన్నాడు అజరయ్యా.

పాదరసం పైకి వెళ్ళి, అజరయ్యాకు తన సమస్య గురించి తెలిపాడు.

అజరయ్యా గట్టిగా నవ్వి, పాదరసం చెయ్యి తీసుకుని పరీక్షించి, "నీకు ప్రాణం మీద ఆశ ఉంటే ఈ ప్రయత్నం మానుకో. నిన్ను చంపించాలనే ఎవరో నీకి ప్రేరణ కలిగించారు. అయితే నీకు నాకన్న హెచ్చు ఆయుర్దాయం ఉన్నది. లేనట్లయితే నిన్ను



ఈ క్షణంలోనే చంపి, దూరంగా పారేసి ఉండేవాణ్ణి," అన్నాడు.

"పాదరసం" మండిపడి, కత్తి దూస్తూ, "నే నడిగినది ఇస్తావా? లేక నీ ప్రాణం తీసేదా?" అన్నాడు.

"ఆ చెయ్యి పడిపోవాలి!" అన్నాడు అజరయ్యా. మరుక్షణం "పాదరసం" కుడి చెయ్యి చచ్చుబడింది.

అతను కత్తిని ఎడమ చేతిలోకి తీసుకున్నాడు. కాని అజరయ్యా దాన్ని కూడా చచ్చుబడిపోయేటట్టు చేశాడు.

"ఇకనైనా నీ ఆలోచన వదులుకుంటావా?" అన్నాడు అజరయ్యా "పాదరసం"తో.

"నాకా దుప్పటీ, నగలూ కావాలి!" అన్నాడు "పాదరసం" మొండిగా.

"అలా అయితే గాడిదవై, వాటిని మొయ్యి!" అంటూ అజరయ్యా "పాదరసం" మీద నీరు చల్లాడు. "పాదరసం" గాడిదగా మారిపోయాడు.

మర్నాడు అజరయ్యా తన దుకాణానికి "పాదరసం" అలీని తోలుకుపోయాడు; సాయంకాలం ఇంటికి తిరిగివచ్చినాక, అతన్ని మళ్ళీ మనిషిని చేసి, "వృధాగా చెడిపోక, ఇంటికి పో. కావాలంటే నిన్ను



గాడిద కన్న కూడా ఇంకా హీనప్రాణిగా మార్చగలను," అన్నాడు.

ఈ మాట విని "పాదరసం" భయపడటానికి మారుగా, ఉద్రేకం చెంది, అజరయ్యా పైన కలియబడ్డాడు. అజరయ్యా అతన్ని ఎలుగుబంటిగా మార్చేశాడు.

మర్నాడు అజరయ్యా కూతురు కమర్ తన తండ్రిని, "నాన్నా, ఈ అబ్బాయి నన్ను పెళ్ళాడతాడేమో కనుక్కో!" అన్నది.

"నువే కనుక్కో!" అని అజరయ్యా కోపంగా తన గదికి వెళ్ళిపోయాడు.

"నీకు కావలిసింది నేనా, లేక నా వస్తువులా?" అని కమర్ అలీని అడిగింది.

"నీ వస్తువులే! వాటిని నేను దిలైలా కూతురు జీనాబ్ అనే సౌందర్యవతికి భరణంగా ఇవ్వాలి," అన్నాడు "పాదరసం".

"వాడి మనసు మారదు," అంటూ అజరయ్యా "పాదరసం" అలీని కోతిగా మార్చాడు.

కమర్ ఒక నిశ్చయానికి వచ్చింది— అతను తనను పెళ్ళాడకపోయినా, అతను కోరిన వస్తువు లిచ్చి, అతనికి సుఖం చేకూర్చ నిశ్చయించుకున్నది. ఆమె ఎంతో కష్టం మీద తన తండ్రిని ఒప్పించి, తన వస్తువులను అతనికి ఇచ్చేస్తూ, "వీటితో నువు నీ జీనాబ్‌ను పెళ్ళాడు," అన్నది.

"పాదరసం" అలీకి కమర్ మీద చాలా అభిమానం కలిగింది. అతను కమర్‌ను వెంటబెట్టుకుని, అహ్మద్ హసన్‌ల వద్దకు వెళ్ళి, జరిగినదంతా చెప్పాడు.

"నువు జీనాబ్‌ను పెళ్ళాడినాక, కమర్‌ను కూడా పెళ్ళాడటం భావ్యంగా ఉంటుంది. అజరయ్యా ఆస్తికంతకూ ఆమె వారసురాలు," అన్నారు వాళ్ళు.

వాళ్ళు దిలైలానూ, జీనాబ్‌నూ, జురేక్‌నూ పిలిపించి, "పాదరసం" జీనాబ్ కోసం తెచ్చిన భరణం చూపి, పెళ్ళికి ఒప్పించారు. ఆ భరణం ఎలా లభించినదీ తెలుసుకుని జీనాబ్, "పాదరసం" కమర్‌ను కూడా పెళ్ళాడటానికి సమ్మతించింది.

"పాదరసం" జీనాబ్‌నూ, కమర్‌నూ పెళ్ళాడాడు. తరవాత కొంతకాలానికి "పాదరసం" ఖలీఫా కొలువులో ఉద్యోగానికి దరఖాస్తు పెట్టుకున్నాడు. అతన్ని పావురాల టపా నిర్వాహకురాలు దిలైలా, ఇద్దరు కొత్వాళ్ళూ శిఫార్సు చేశారు. అందుచేత ఖలీఫా "పాదరసం" అలీని నెలకు వెయ్యి దీనారాల జీతం మీద రాజభటులకు సర్దారుగా నియమించాడు.

"పాదరసం" తన ఇద్దరు భార్యలతో సుఖంగా జీవించాడు. —(అయిపోయింది)





# పరువుతీసిన పాయసం

ఒక గ్రామంలో చలమయ్య అనే పెద్ద కామందు ఉండేవాడు. అతనికి స్వార్జితం, పిత్రార్జితం బోలెడు ఉండేది. కాని అతను పరమలోభి. అయితే ఈ సంగతి ఊరి వారికి తెలీదు. అతను చాలా గొప్పవాడనీ, తన పంక్తిని ఎవరన్నా లేనిదే భోజనం చెయ్యడనీ అంతా చెప్పుకునేవారు.

ఎందుచేతనంటే, ప్రతి రోజూ మధ్యాన్నం వేళ తాను భోజనం చెయ్య బోయే ముందు, చలమయ్య వీధి వాకిట నిలబడి, నలుగురూ వినేలాగా, "నా వెంట భోజనం చెయ్యటానికి అభ్యాగతి ఎవరూ లేరే?" అనేవాడు. కాని వీధి వెంట ఎవ డైనా సాధువులాటి వాడు రావటం కంట పడితే చలమయ్య చటుక్కున లోపలికి వెళ్ళి, తలుపు బిగించుకునేవాడు.

ఒకనాడు రాము డనే పేదవాడు తన భార్యతో సహా బతుకు తెరువు కోసం ఆ గ్రామం వచ్చాడు. ఊళ్ళో విచారిస్తే, చలమయ్య గొప్ప ఉదారుడనీ, సంపన్నుడనీ, అతని వద్ద పని దొరక వచ్చుననీ రాముడికి తెలిసింది.

రాముడు చలమయ్య ఇంటికి వెళ్ళి, తనకూ, తన భార్యకూ పని చూపిస్తే, చలమయ్య ఇచ్చే జీతంతో పొట్ట పోసుకుంటూ, బతికి ఉన్నంతకాలమూ చాకిరీ చేస్తా మన్నాడు. ఆ సమయంలో చలమయ్య చుట్టూరా నలుగురు పెద్ద మనుషులు కూర్చుని ఉన్నారు. వారి ముందు తన పరువు పోతుందని, చలమయ్య రాముణ్ణీ, వాడి పెళ్లాన్నీ పనిలో ఉంచుకోవటానికి ఒప్పుకున్నాడు. కాని జీతం ఇంత అని అనలేదు.

చలమయ్య ఇంటి వెనక ఒక పడి పోయిన కొట్టం ఉన్నది. అందులో రాముడూ, వాడి పెళ్లాం ఉంటూ వచ్చారు.

జి. నిర్మల



రాముడు ఇంటి పనీ, పై పనీ చేసేవాడు. వాడి పెళ్లాం పాచిపని అంతా చేసేది. ఇద్దరి చేతా వెట్టిచాకిరి చేయించుకుంటూ, చలమయ్య వాళ్ళకు చాలా తక్కువ జీతం ఇచ్చేవాడు. ఆ జీతం రాముడికీ, వాడి పెళ్ళానికీ తిండి తినటానికి కూడా చాలేది కాదు. అందుచేత వాళ్ళు రోజూ నూకల గంజి వండుకుని, అందులో ఇంత ఉప్పు వేసుకుని, అందులో రెండు పచ్చిమిరప కాయలు నంజుకుని, కడుపు నించుకునేవారు.

చలమయ్యగారింట ఏ నాడూ వంటకాలు మిగిలేవి కావు. చలమయ్య భార్య ఒక్క నలుసు మిగలకుండా బొటాబొటిగా వంట తయారుచేసేది.

"ఈ వెట్టిచాకిరి ఇంకెక్కడ చేసినా కడుపుకు ఇంత తిండి అయినా దొరుకుతుంది. ఇక్కడినుంచి వెళ్ళిపోదాం," అనేది రాముడి పెళ్ళాం.

రాముడికి కూడా చలమయ్య ఇల్లు విడిచి పెట్టాలనే ఉంది, కాని ఏదోవిధంగా చలమయ్యకు తగిన విధంగా బుద్ధి చెప్పి మరీ యిక్కణ్ణించి వెళ్ళిపోవాలని వాడి ఉద్దేశం.

ప్రస్తుతానికి వాడు చలమయ్య మీది కోపాన్ని వెటకారం రూపంలో బయట పెడుతున్నాడు. వాడు తిండితినటానికి కూర్చున్నప్పుడల్లా, "ఏమేవ్, పాయసం వండటం పూర్తి అయిందా? వేగిరం తీసుకురా! చక్కెర కాస్త జాస్తి వెయ్యి. వచ్చేటప్పుడు రెండు పచ్చ అరటిపళ్ళు పట్టుకురా!" అని భార్యను కేకవేసేవాడు. వాడి భార్య గంజిలో మరో చిటికెడు ఉప్పువేసి, రెండు పచ్చిమిరపకాయలతో సహా తెచ్చి వాడి ముందు పెట్టేది.

రోజూ రాముడు తన పెళ్ళాన్ని పాయసమూ, పచ్చఅరటిపళ్ళూ తీసుకురమ్మని గట్టిగా కేకవెయ్యటం చలమయ్య భార్య

చెవిని పడింది. ఆవిడకు పాయసం చాలా ఇష్టం. కాపరానికి వచ్చి ఆమె పాయసాన్ని వాసన చూసి అయినా ఎరగదు. పచ్చ అరటిపళ్ళ మాట చెప్పనే అక్కర్లేదు. రాముడి కేకలు విన్నప్పుడల్లా ఆమెకు నోరూరేది.

పట్టలేక ఆమె రాముడి పాయసం సంగతి తన భర్తకు చెప్పింది. చలమయ్యకు చాలా ఆశ్చర్యం వేసింది. తాను ఇచ్చే కొద్ది జీతంతో కూలిదంపతులు పాయసాలూ, అరటిపళ్ళూ ఎలా ఆరగిస్తున్నారో అతనికి అర్థం కాలేదు. రాముణ్ణి అడిగి తెలుసుకో వాలనుకున్నాడు.

మర్నాడు రాముడు పనిలోకి రాగానే చలమయ్య వాడితో అదీ ఇదీ మాట్లాడి, "ఏరా, మీ కేమీ లోటు లేదుకద?" అని అడిగాడు.

"మా బతుకులు లోటు లేకుండా ఎలా గుంటాయి, బాబయ్యా?" అన్నాడు రాముడు.

"అదేమిట్రా? రోజూ పాయసమూ, పళ్ళూ తింటూ బీదఅరుపులు అరుస్తా వేంరా? ఆ సంగతేమీ నాకు తెలియదను కున్నావా?" అన్నాడు చలమయ్య.

"అదా బాబయ్యా? మాబోటి వాళ్ళకు అందుబాటులో ఉండేవి అవే కదా? మేం





తాగే పాయసం నా భార్య బాగా చేస్తుంది కూడా!" అన్నాడు రాముడు.

"పాయసం చాలా తక్కువ ఖర్చులో అయ్యే వంటకమే నన్నమాట!" అను కున్నాడు చలమయ్య.

తరవాత కొద్ది రోజులకు చలమయ్య కుమార్తె పెళ్ళి చూపులకు పొరుగూరి కామందూ, అతని కొడుకూ, ముఖ్యులైన బంధు మిత్రులూ ఓ పదిమందిదాకా వచ్చారు. వారందరినీ చూసేసరికి చల మయ్య గుండె గుభేలుమన్నది. వీరందరికీ విందుభోజనం పెట్టక తప్పదు. ఏ ఖర్చ యినా తప్పతుందిగాని ఈ ఖర్చు తప్పదు.

ఇంతలో చలమయ్యకు ఒక ఆలోచన వచ్చింది. అతను రాముణ్ణి పిలిచి, "ఒరే, రాముడూ! వెంటనే బజారుకు పోయి, పాయసానికి కావలసిన సామాన్లు కొని, నువు రోజూ తినే పచ్చఅరటిపళ్ళు కొనుక్కురా. ఆ పాయసం నీ భార్యచేతనే వండించు. ఖర్చు మాత్రం సాధ్యమైనంత తక్కువలో పోనియ్," అన్నాడు.

చలమయ్యకు బుద్ధి చెప్పే అవకాశం రాముడికి దొరికింది. వాడు బజారు నుంచి కొద్ది చిల్లర సామాన్లు తెచ్చి, తన భార్యకు రహస్యంగా చెప్పి, అతిథులకు వంట చెయ్యమని పంపాడు.

అతిథులు పెళ్ళిచూపులూ, ఇతర లాంఛ నలూ పూర్తిచేసి భోజనానికి కూర్చున్నారు. చలమయ్య భార్య వడ్డనకు రావడానికి సిగ్గుపడి, ఆ పని కూడా రాముడి పెళ్ళాన్నే చెయ్యమన్నది.

"అందరికీ ముందు పాయసం వడ్డించు," అని చలమయ్య రాముడి పెళ్ళాన్ని ఆజ్ఞాపించాడు.

రాముడి పెళ్ళాం నూకలగంజి పాత్ర తీసుకుని, ఒక్కొక్కరి విస్తరిలోనూ గంజీ, ఉప్పూ, పచ్చిమిరపకాయలూ వడ్డించ సాగింది. తన విస్తట్లో పడిన పదార్థాలు

చూడగానే పెళ్లికొడుకు తండ్రి పరంధా మయ్య ముఖం కందగడ్డలా అయిపోయింది.

వడ్డన ఇంకా తన దాకా రాకమునుపే అతిథుల వాలకంలో మార్పు గమనించి చలమయ్య, "ఏమిటి, బావగారూ, ఆలోచిస్తు న్నారు? అది పాయసంలెండి. మీ కోసం ఇవాళ ప్రత్యేకంగా చేయించాను. చల్లారక ముందే భోంచెయ్యండి. చల్లారితే బాగుం డదు," అన్నాడు.

పరంధామయ్య ఆగ్రహంతో విస్తరి ముందు నుంచి లేచి, "భలేవాడివేనయ్యా! మమ్మల్ని ఇంతగా అవమానిస్తావా? నీతో సంబంధం చేసుకుంటే మా పరువు గంగ పాలే! నూకలగంజి పోసి పాయస మంటావా? మాకు పాయసం ముఖమే తెలియదా?" అంటూ తనవారి నందరినీ లేవగొట్టి, తన వెంట తీసుకుపోయాడు.

ఈ సంగతి క్షణాల మీద ఊరంతా పాక్కిపోయింది.

చలమయ్యకు రాముడి మీదా, వాడి పెళ్ళాం మీదా భరించరాని ఆగ్రహం వచ్చింది. అతడు రాముడి మీద విరుచుకు పడి, "భ్రాష్టుడా! నీ పెళ్ళాం చేత పాయసం చేయిస్తానని చెప్పి, నూకలగంజి పోయించి నలుగురిలోనూ నా పరువు తీశావుగదరా!" అంటూ అరవసాగాడు.

వాకిట పోగైన నలుగురూ సంగతి వివ రంగా గ్రహించారు.

రాముడు మాత్రం తాపీగా, "గతిలేని వాడికి గంజే పాయసమని మీకు తెలియదా? మీ రిచ్చే జీతం డబ్బులతో మాకు నూకల గంజికి మించిన పాయసం ఎలా వస్తుంది? మేం రోజూ తాగే పాయసమే గదా మీరు చెయ్యమన్నది? మధ్య మా తప్పే మున్నది?" అన్నాడు.

చలమయ్యకు తల తీసేసినట్టయింది. అతనికి తగిన శాస్తి చేసినందుకు రాముణ్ణి ఊళ్ళోవాళ్ళు మెచ్చుకున్నారు.






# గజపాదలింగేశ్వరుడు

మణిపురరాజ్యాన్ని మణిదత్తు డనే రాజు పాలించేవాడు. మారు వేషంలో రాజ్య మంతటా సంచారం చేసి ప్రజల కష్టసుఖాలు స్వయంగా తెలుసుకునే అలవాటు అయనకు ఉండేది.

ఒకనాడు ఆయన ఒక గుడిసెలో జరిగే సంభాషణ విన్నాడు. ఒక మగవాడు తన భార్యతో, "రాజుగారి దివాణంలో ఏ చిన్న ఉద్యోగం దొరికినా ఏడంతస్తుల మేడ కట్టనా?" అన్నాడు.

ఈ మాట విని రాజుకు ఆశ్చర్యం కలిగింది. ఆ గుడిసెలో ఉండే మనిషి ఎవరో తెలుసుకుని రాజు మర్నాడు తన భటుల చేత అతన్ని తన దివాణానికి పిలిపించి, అతన్ని తన కాసావాళ్ళ పై అధికారిగా నియమించాడు. ఆ మనిషి పేరు రామయ్య.

రామయ్య ఉద్యోగం ప్రారంభిస్తూనే కాసావాళ్ళను బెదిరించి, వాళ్ళు గుర్రాల దానాలోనూ, గడ్డిలోనూ మిగుల్చుకుంటున్న డబ్బులో వాటా తీసుకున్నాడు.

ఏడాది గడిచేసరి కల్లా రామయ్య ఇల్లు కట్టటం ప్రారంభించి, ఒక అంతస్తు పూర్తి చేశాడు. రాజుగారికి ఇది తెలిసింది. వెంటనే ఆయన రామయ్యను కాసావాళ్ల మీది నుంచి తొలగించి మావటివాళ్ళ మీద అధికారిగా వేశాడు.

ఈ సారి రామయ్య ఆదాయం మరింత పెరిగింది. అతను ఆరుమాసాలలోనే తన ఇంటి రెండో అంతస్తు పూర్తిచేశాడు.

ఈ సంగతి తెలియగానే రాజుగారు రామయ్యను నది ఒడ్డున ఒంటరిగా ఉండేటట్టు ఏర్పాటు చేశాడు. అక్కడ అతని కోసం ఒక పాకా వేసి, అక్కడికి అతనికి అవసరమైన వస్తువులు పంపనిశ్చయించాడు.

రామయ్య రాజుగారిని, తాను నదీతీరాన ఉండటానికి అనుమతి పత్రాన్ని దయచే

జి. సత్యనారాయణ





యించవలసిందిగా కోరాడు. రాజు అనుమతి పత్రాన్ని తయారుచేయించి, దాని మీద తన ముద్ర వేసి ఇచ్చాడు.

రామయ్య ఆ పత్రాన్ని పట్టుకుపోయి, నది ఒడ్డున పాకలో మకాం పెట్టి, నదిలో చేపలు పట్టేవారి నుంచీ, సరుకులు చేరవేసే పడవలవాళ్ళ నుంచీ సుంకాలు వసూలు చేశాడు. రాజుగారు తనను సుంకాలు వసూలు చెయ్యటానికే పంపారని చెప్పి, అనుమతి పత్రాన్ని అందరికీ చూపాడు.

ఏడాది గడిచింది. రామయ్య ఇంటికి మరి రెండు అంతస్తులు వెలిశాయి.

రామయ్య సామర్థ్యం చూసి రాజుకు ఆశ్చర్యమయింది. అతను డబ్బు ఎలా సంపాదిస్తున్నదీ రాజుగారికి అంతు చిక్క లేదు. రామయ్యను నిర్జన ప్రదేశంలో పెడితే ఏంచేస్తాడో చూతామని, ఆయన అతన్ని ఎడారి మధ్యకు పంపాడు. అక్కడ అతనికి ఒక పాకా వేసి, తిండికి మాత్రం తగిన ఏర్పాటు చేశాడు.

కొద్దిరోజులకు ఒక పరదేశీయుడు ఏనుగు మీద ఆ ఎడారి కుండా ప్రయాణం చేశాడు. తడి ఇసుకలో ఏనుగుపాదం లోతుగా దిగి ఒక చోట గుంట ఏర్పడింది. వెంటనే రామయ్యకు ఒక ఆలోచన తట్టింది. లింగా కారంలో ఉన్న ఒక రాయి సంపాదించి తెచ్చి, దాన్ని ఆ గుంటలో ఉంచి, దాని పైన రామయ్య ఒక పందిరి వేశాడు.

ఇతర దేశాల నుంచి మణిపురానికి ఎడారి మీదుగా వెళ్ళే వర్తకులు ఆ పందిరి చూసి, అది ఏమిటో తెలుసుకోవటానికి రామయ్య దగ్గిరికి వచ్చారు.

"ఇక్కడ గజపాదలింగేశ్వరస్వామి వెలిశాడు. నేను ఆ స్వామికి సేవ చేస్తూ ఈ ఎడారిలో ఉంటున్నాను," అని రామయ్య వారితో అన్నాడు.

ఆ వర్తకులు ఆ రాతికి మొక్కుకుని, వ్యాపారంలో లాభాలు వస్తే కొంత గజపాద



లింగేశ్వరస్వామికి ఇస్తామన్నారు. సహజంగా వారికి వ్యాపారంలో లాభాలు వచ్చాయి. అది గజపాదలింగేశ్వరస్వామి చలవేనని నమ్మి రామయ్యకు దండిగా డబ్బు ఇచ్చారు.

క్రమంగా గజపాదలింగేశ్వరస్వామి మహిమ మణిపురానికి కూడా పాకింది. తండోపతండాలుగా యాత్రికులు రాసాగారు. ఎడారి మధ్య గుడి వెలిసింది. యాత్రికుల సంఖ్య నానాటికీ పెరుగుతున్నది. దానితో బాటు రామయ్య రాబడీ పెరుగుతున్నది.

ఇలా ఉండగా రాజుగారికి జబ్బుచేసింది. జబ్బు నయమైతే గజపాదలింగేశ్వరుడికి నిలువుదోపిడీ ఇస్తానని రాణీగారు మొక్కుకున్నది. రాజుగారికి తిరిగి ఆరోగ్యం చేకూరగానే ఆమె ఈ సంగతి చెప్పి, రాజుగారిని వెంటబెట్టుకుని సపరివారంగా ఎడారికి బయలుదేరింది.

రాజుగారు వస్తున్నారని తెలియగానే రామయ్య వేషం మార్చి, రాణీగారి చేత పూజలు చేయించి, నిలువుదోపిడీ పుచ్చుకున్నాడు.

ఇది జరిగిన కొద్ది కాలానికే రామయ్య ఇల్లు ఏడంతస్తులూ పూర్తి అయాయి.

రాజు ఆశ్చర్యానికి అంతులేదు. ఎడారిలో ఉన్న రామయ్య ఇంత కొద్ది కాలంలో మూడంతస్తులు ఒక్కసారిగా ఎలా కట్టించాడో అయనకు అర్థం కాలేదు. ఆయన ఎడారికి తన భటులను పంపి, రామయ్యను పిలిపించి, "నా దగ్గిర ఉద్యోగాలు చేస్తూ ఏడంతస్తుల భవంతి ఎలా కట్టావు?" అని అడిగాడు.

"మహారాజుగారు నన్ను దండించనని మాట ఇస్తే అంతా మనవి చేస్తాను," అని రామయ్య రాజుగారి అభయం పొంది, అంతా చెప్పేశాడు.

రాజు రామయ్య తెలివితేటలకు సంతోషించి అతన్ని తన సలహాదార్లలో ఒకడుగా వేసుకున్నాడు.





# ముగ్గురు యక్షిణులు

ఒక రైతుకు మంగళుడు అని ఒక కొడుకుండేవాడు. మంగళుడికి పొలం పనిలో ఏమీ ఆసక్తి లేకపోవటం గమనించి, రైతు వాణ్ణి ఇంకేదన్నా వృత్తిలో పెడదామనుకుని, వాడితో ఊళ్ళ మీద బయలుదేరాడు.

ఎక్కడా మంగళుడికి పని నేర్పేవాళ్ళు దొరకలేదు. కొన్నాళ్ళయాక, ఒక సాయంకాలం వాళ్ళు పెద్ద మైదానం మధ్య ఉన్న ఒక ఇంటిని చూశారు.

రైతు ఆ ఇంటిని సమీపించే సరికి ఒక మనిషి బయటికి వచ్చి "ఎవరు మీరు? ఏం కావాలి?" అని అడిగాడు.

"నే నొక రైతును. వీడు నా కొడుకు మంగళుడు. వీణ్ణి మీ దగ్గిర పెట్టుకుని మీ వృత్తి నేర్పండి," అన్నాడు మంగళుడి తండ్రి.

"మా వృత్తి ఏమిటనుకున్నావు?" అని ఆ మనిషి నవ్వుతూ అడిగాడు.

"ఏదైనా నాకు అభ్యంతరం లేదు. నా కొడుకు ఏ వృత్తిలోనైనా సరే పైకి రావాలి. అదే నాకు కావలిసింది," అన్నాడు రైతు.

"సరే, మీ వాడికి మా వృత్తి నేర్పి నీ దగ్గిరికి పంపిస్తాం," అన్నాడా మనిషి.

ఇంతకూ ఆ మనిషి ఒక దొంగలముఠా నాయకుడు. అతనితోబాటు నలభైమంది దొంగలు ఆ పెద్ద ఇంట్లో ఉంటున్నారు.

రైతు ఆ రాత్రి దొంగలతోనే గడిపి తెల్లవారగానే తన గ్రామానికి బయలుదేరి వెళ్ళిపోయాడు.

మంగళుడికి దొంగలు చెప్పిన మొదటి పని నీరు తేవటం. వాళ్ళుండే ఇంటికి కొద్ది దూరంలో ఒక వాగున్నది. దాని నుంచి నీరు తెద్దామని మంగళుడు ఒక కడవ తీసుకుని వెళ్ళాడు. వాడు ఆ కడవను నీటిలో ముంచబోతూండగా ఒక స్త్రీ చెయ్యి నీటి నుంచి పైకి వచ్చి ఆ కడవను గట్టిగా పట్టుకున్నది.



మంగళుడు కడవను వదలకుండా పెనుగు లాడాడు. ఇంతలో వాడి తల మీద బలంగా దెబ్బ పడింది. చెయ్యి మాయమయింది. కాని తన తల మీద దెబ్బ కొట్టిన పాత్ర వాడికి నీటి ఒడ్డున దొరికింది. మంగళుడు దాన్ని దొంగల వద్దకు తీసుకుపోయాడు.

ఆ పాత్రను చూసి దొంగలు నిర్ఘాంత పోయి, అది ఎక్కడిదని అడిగారు. మంగళుడు వాళ్ళకు జరిగినదంతా చెప్పి, ఎవరిదో ఒక ఆడదాని చెయ్యి తన నెత్తి మీద ఆ పాత్రతో కొట్టిందన్నాడు.

దొంగల నాయకుడు మంగళుణ్ణి కౌగలించుకుని, "ఒరే, నాయనా! ఈ పాత్ర విలువ ఎంతైనా కావచ్చు. న్యాయంగా ఇది నీది. దీన్ని అమ్మామంటే మనం మరి దొంగతనాలు చేసే పని ఉండదు. నీ వంతు వచ్చిన డబ్బు తీసుకుని మీ ఇంటికి వెళ్ళి పోయి, బతికున్నన్నాళ్ళూ హాయిగా ఉండ వచ్చు," అన్నాడు.

అతను వెంటనే ఆ పాత్రను తీసుకుని తన గుర్రం మీద నగరానికి వెళ్ళి, ఒక బంగారు వర్తకుడికి దాన్ని చూపి, "దీన్ని ఎంతకు కొంటారు?" అని అడిగాడు.

"దీని వెల నేను ఇచ్చుకోలేను. పెద్ద రత్నవర్తకుడు ఉన్నాడు, అయనకు చూపించు," అన్నాడు బంగారు వర్తకుడు.

రత్నవర్తకుడు ఆ పాత్రను చాలాసేపు పరీక్షించి, "దీన్ని నేను కొంటాను. అయితే దీని ధర రాజుగారు ఎంత అని నిర్ణయిస్తే అంత ఇస్తాను," అన్నాడు.

ఇద్దరూ కలిసి రాజుగారి దగ్గిరికి వెళ్ళారు.

రత్నవర్తకుడు రాజుతో, "మహారాజా, కిందటేడు మా దుకాణంలో పడి, ఈ పాత్రనూ, ఇంకా ఇతర వస్తువులనూ దొంగిలించిన దొంగ దొరికాడు," అంటూ దొంగల నాయకుణ్ణి చూపాడు.

"ఈ పాత్ర నీకెక్కడిది? నిజం చెప్పు," అని రాజు దొంగలనాయకుణ్ణి అడిగాడు.



"మా దగ్గిర పని నేర్చుకునేటందుకు చేరిన కుర్రాడికి ఇది వాగు ఒడ్డున దొరికింది," అన్నాడు దొంగలనాయకుడు.

"మీరు చేసే వృత్తి ఏమిటి?" అని రాజు మళ్ళీ అడిగాడు.

"మహారాజా, నిజం చెప్పాలంటే మా వృత్తి దొంగతనం. మేమంతా కలిసి నలభై మందిమి. మా దగ్గిర పని నేర్చుకోవటానికి ఇప్పుడే ఒక కుర్రాడు చేరాడు. వాడికే ఇది దొరికింది," అన్నాడు దొంగలనాయకుడు.

రాజు తన భటులను దొంగ లున్న ఇంటికి పంపించి, మిగతా ముప్పైతొమ్మిది మంది దొంగలనూ, మంగళుణ్ణీ పట్టితెప్పించాడు. మంగళుడు రాజు ముందు వంగి నమస్కారం చేసి, "మహారాజా, నాకే ఈ పాత్ర దొరికింది. తమ సెలవైతే ఏడాదిలోగా ఇలాటి పాత్రలు మరో పదకొండు తీసుకు రాగలను. కాని తమరు నగరంలో ఉండే మోసపు వర్తకుల తలలు తీసేస్తానని మాట ఇవ్వండి," అన్నాడు.

"నిన్ను వదిలేస్తాను. నువు వెళ్లి ఏడాదిలోగా ఇలాటి పాత్రలు మరి పదకొండు పట్టుకురా. అంత దాకా ఈ నలభైమంది దొంగలూ బందిఖానాలో ఉంటారు," అన్నాడు రాజు.



మంగళుడు ఆ పాత్రను తన దుస్తులలో దాచుకుని, దొంగలనాయకుడి గుర్రం ఎక్కి, మరొక రాజ్యానికి వెళ్ళి, అక్కడ ఒక పేదరాసిపెద్దమ్మ ఇంట దిగాడు.

"పెద్దమ్మా, ఏమిటి ఈ ఊరి విశేషాలు?" అని మంగళుడు పెద్దమ్మను అడిగాడు.

"ఏమున్నది, నాయనా? మా రాజుగారి కొడుకు నీ యీడువాడే ఈ మధ్య చనిపోతే సమాధి చేశారు. ప్రతి రాత్రీ ఎవరో వచ్చి రాజకుమారుడి శవాన్ని కదిలిస్తున్నారు. రాజుగారు చాలా ఆందోళన పడిపోతున్నారు," అన్నది పేదరాసిపెదమ్మ.



మంగళుడు పెద్దమ్మను వెంటబెట్టుకుని రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, ఈ రాత్రి నేను రాజకుమారుడి సమాధికి కాపలా కాస్తాను, అనుమతి ఇవ్వండి," అన్నాడు.

"కాపలా వాళ్ళేమీ చెయ్యలేకపోయారు. కావలిస్తే నువు కూడా కాపలా కాసి చూడు," అన్నాడు రాజు.

మంగళుడు విల్లంబులు తీసుకుని ఆ రాత్రి రాజకుమారుడి సమాధి వద్దకు వెళ్ళి, సమాధికి కొద్ది దూరంలో ఒక చీకటి ప్రదేశంలో దాక్కున్నాడు.

సరిగ్గా అర్ధరాత్రి అయేసరికి మూడు తెల్లపావురాలు ఆకాశం నుంచి సమాధి ముందుకు దిగి ముగ్గురు స్త్రీలుగా మారాయి. ఒక స్త్రీ చేతిలో ఎర్రని బెత్తం ఉన్నది. ఆమె ఒక చిన్న గుడ్డను నేల మీద పరిచి, దాని మీద ఎర్రబెత్తంతో కొట్టి, "వడ్డించు!" అన్నది. వెంటనే ఆ గుడ్డ మీద నాలుగు కంచాలలో భోజనం వచ్చింది.

తరవాత ఆమె సమాధిలోకి వెళ్ళి, దాని అడుగున ఉండే రాతి మీద కొట్టి, "తెరుచుకో!" అన్నది.

రాయి పైకి లేచింది. ఆమె దాని అడుగున ఉన్న శవాన్ని బెత్తంతో తాకి, "లేచి రా!" అన్నది.

వెంటనే రాజకుమారుడు ప్రాణాలతో లేచి పైకి వచ్చాడు. తరవాత నలుగురూ కూర్చుని భోజనానికి ఉపక్రమించారు.

అదే సమయమనుకుని మంగళుడు ఒక బాణం ఎక్కుపెట్టి, రాజకుమారుడికి తగలకుండా స్త్రీల మధ్యకు వదిలాడు. వెంటనే ముగ్గురు స్త్రీలూ పావురాలుగా మారి ఎగిరిపోయారు. వాళ్ళు తమ వెంట తెచ్చిన తుండుగుడ్డా, బెత్తమూ అక్కడే ఉండిపోయాయి. మంగళుడు వాటిని తీసుకుని, రాజకుమారుడితో, "ఇంక నీకు ఈ సమాధితో ఏం పని? మీ ఇంటికి పోదాం పద!" అన్నాడు.

—(ఇంకావుంది)



# 108. వక్తృత్వాన్ని ప్రసాదించే శిల

ఐర్లండులోని కార్క్ అనే నగరం సమీపంలో బ్లార్నీకోట ఉన్నది. దీని బురుజు గోడలో ఒక ప్రసిద్ధమైన శిల ఉన్నది. దాన్ని "బ్లార్నీస్టోన్" అంటారు. దాన్ని ముద్దుపెట్టుకున్న వారికి అపారమైన వక్తృత్వం కలిగేటట్టుగా ఒక మంత్రగత్తె వరమిచ్చిందని చెబుతారు. ఆ శిలను ముద్దుపెట్టుకోవటం తేలిక కాదు. అయినా అది ముద్దులతో నునువు తేలిందట! (ఇంగ్లీషులో "బ్లార్నీ" అంటే ఇచ్చకాలని అర్థం. ఐర్లండును "బ్లార్నీలాండ్" అని కూడా అంటారు.)



Photo by B. Bhansali



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఇద్దరు చాలు.

పంపినవారు:
డా.వి.వరదాచార్యులు,వరంగల్

Photo by D. N. Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఇందరెందుకు ?

ఎంపికవారు :
డా.వి.వరదాచార్యులు,వరంగల్

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 జనవరి నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ నవంబర్ నెల ఆఖరు తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇందరెందుకు ?

రెండవ ఫోటో : ఇద్దరుచాలు.

పంపినవారు : డాక్టర్. వి. వరదాచార్యులు,
వరంగల్.

బహుమతి మొత్తం రు. 20/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



# రీవ్స్

రీవ్స్ పెయింటర్ బుడ్డి, ఎగిరే గుఱ్ఱపుస్వారీవారు ఇంద్రధనస్సును రక్షించి యింటికి తీసుకు రమ్మని అడగబడ్డారు. మేఘలోకంలో ఖైదీగాయున్న ఇంద్ర ధనస్సు తళతళా మెరుస్తూ కతులు, ఈ రెలత్ కారు మేఘాలలో రక్షించబడుతూయున్నాయి. మేఘలోకంలో ఏ ఒక్కరు ప్రవేశించినా మెఱుపుచేత ఛేదించబడరాదు.

రీవ్స్ పెయింటర్ బుడ్డి మేఘలోకంలో చేరే వరకు ఆకాశంలో ఎగురుతూనేయున్నాడు.



మేఘాలరాజు రీవ్స్ పెయింటర్ బుడ్డిని చూచి పెద్ద రాక్షసి వలె వికృతాకారంగా పురుమువలె వెనుక వళ్ళతోనవ్వెను.





కాని రీవ్స్ పెయింటర్ బుడ్డి భయపడలేదు. తక్షణమే తన ఆతగాడైన సూర్యుడు తలచుకొన్నాడు. వెంటనే సూర్యుడు ప్రత్యక్షమయ్యాడు.





మేఘాలు తన శక్తిని కోల్పోయి పారిపోవుట చూచి ఇంద్రధనస్సు మిక్కిలి సంతోషంతో రీవ్స్ పెయింటర్ బుడ్డితో పరుగెత్తింది.



నెమ్మదిగా రీవ్స్ పెయింటర్ బుడ్డి తన చిన్న పెట్టెలో ఇంద్ర ధనస్సు పెట్టుకొన్నాడు. అతను ఎన్నో చిన్న పెట్టెలు చేసి వాటిలో ఇంద్రధనస్సును పెట్టుకొన్నాడు.





# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి



ప్రొద్దున్న వివా త్రాగుతే... రోజంతా ఉత్సాహముగా ఉంటారు! మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో వివాలోని పూర్తి మీగడగల పాలు పుష్టివంతముగా చేయబడినవి.

రాత్రి **వివా** త్రాగుతే... రాత్రంతా గాఢముగా నిద్రపడుతుంది! వివా యొక్క పసందైన రుచి మరియు దానిలోని పోషకవంతమైన పదార్థములు స్నాయువులను బలపరుస్తాయి, నరములకు ఉపశమనమును కలిగిస్తాయి, కండరములకు సేదదేరుస్తాయి.

**వివా** సులభముగా జీర్ణమవుతుంది... రోగులకు మరియు రోగమునుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా నిపొర్పుచేయబడినది.

**ఆరోగ్యమునకు త్రాగండి వివా!**
**నీళ్లలో లేక పాలలో దాని రుచి అహా!**




భారతదేశములో తయారుచేయువారు:
**జగత్‌జిత్ ఇండస్ట్రీస్ లిమిటెడ్,**
జగత్‌జిత్ నగర్, హమీర (పంజాబ్)

సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
హోమ్ ప్రొడక్ట్స్ మార్కెటింగ్ ఏజెన్సీ.
ఎ డివిజన్ ఆఫ్ సారాభాయ్ సన్స్ ప్రైవేట్ లిమిటెడ్.

Shilpi JI-2A/70 Tel.

## <u>ఒకే</u> ఉతుకులో 3 దశలుగా పనిచేసి...




# డెట్ బట్టలను ఎక్కువ తెల్లగా ఉతుకుతుంది

—ఏ యితర పొడరు కంటె

## ఎలా చేస్తుందో ఎందుకు చేస్తుందో చూడండి:

1వ. దశ : **డెట్** లోగల ఒక ప్రత్యేకమైన పదార్థము బట్టలోనికి త్వరగా చొచ్చుకొనిపోయి, బాగా అంటుకొని ఉన్న మట్టిని కూడ వదలిస్తుంది—బట్టలు శుభ్రపడతాయి.

2వ. దశ : **డెట్** మట్టిని వదలించిన తరువాత దానిని బట్టకు మళ్లీ అంటుకోకుండా చేస్తుంది—దుస్తులు శుభ్రపడతాయి, శుభ్రముగా ఉంటాయి.

3వ. దశ : **డెట్** బట్టలకు అదనపు తెల్లదనమును కలిగిస్తుంది—బట్టలు పూర్వము కంటె ఎక్కువ తెల్లగా ఉంటాయి! (నీలి లేక తెలుపుచేసే పదార్థమును చేర్చనక్కర లేదు)

SHILPI HPMA 38A/70 TEL **డెట్‌ను నేడే కొనండి!** స్వస్తిక్ ఆయిల్ మిల్స్, బొంబాయి

